

## కసిరెడ్డి కలం నుండి
## సాహిత్య విమర్శ...

| | | | |
|---|---|---|---|
| 1. | తెలుగు పొడుపు కథలు (సిద్ధాంత గ్రంథం) | - | 1990 |
| 2. | పొడుపు కథలు-ఒక పరిశీలన (వ్యాస సంపుటి) | - | 1986 |
| 3. | జాగృత సాహితి (వ్యాస సంపుటి) | - | 1993 |
| 4. | శ్రీ కృష్ణ సందేశం (వ్యాస సంపుటి) | - | 1994 |
| 5. | పత్రికల్లో భాష (వ్యాస సంపుటి) | - | 1994 |
| 6. | జానపద సాహిత్యం :అధ్యయనం - అనుశీలనం (వ్యాస సంపుటి) | - | 1994 |
| 7. | చైతన్య సాహితి (50 సంపాదకీయాలు) | - | 1997 |
| 8. | జాతీయ సాహితి (వ్యాస సంపుటి) | - | 1997 |
| 9. | జానపద కళా ప్రదర్శనం (వ్యాస సంపుటి) | - | 1997 |
| 10. | భారతీయ మహిళ (వ్యాస సంపుటి) | - | 1997 |
| 11. | వేమన త్రిశతి (మున్నూరు పద్యాలకు తాత్పర్యం) | - | 2001 |
| 12. | కాపుబిడ్డ (తాత్పర్య వివరణం) | - | 2001 |
| 13. | నవీన సాహితి (వ్యాస సంపుటి) | - | 2001 |
| 14. | పీఠికాసాహితి (వ్యాస సంపుటి) | - | 2002 |
| 15. | పీఠికల పేటిక (వ్యాస సంపుటి) | - | 2002 |

కసిరెడ్డి సాహితీ త్రింశతి ప్రచురణ - 5

# అమృత సూక్తం
## వచన కవితా సంపుటి



- డా॥ కసిరెడ్డి

కసిరెడ్డి సాహితీ త్రింశతి ప్రచురణ - 6

# అమృతసూక్తం

వచన కవితా సంపుటి

## డా॥ కసిరెడ్డి




ప్రచురణ

**జాతీయ సాహిత్య పరిషత్**

భాగ్యనగర్ శాఖ

ఆంధ్రప్రదేశ్

కసిరెడ్డి సాహితీ త్రింశతి ప్రచురణ - 6

**అమృతసూక్తం** (వచన కవితా సంపుటి)

- డా॥ కసిరెడ్డి

ప్రథమ ముద్రణ : 2002 ఫిబ్రవరి

ప్రతులు : 1000

ప్రచురణ సంఖ్య : 61

**జాతీయ సాహిత్య పరిషత్**
3-4-705/4,
భాగ్యనగర్ శాఖ, నారాయణగూడ,
హైదరాబాద్ - 500 029

ప్రతులకు :
**సాహిత్య నికేతన్**
3-4-852, బర్కత్‌పుర,
హైదరాబాద్ - 500 027

అక్షర కూర్పు :
**కావ్యశ్రీ గ్రాఫిక్స్**
2-2-1136/7/1/సి, న్యూనల్లకుంట,
హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 7550530

ముద్రణ :
**కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్,**
40, ఎపిహెచ్,
విద్యానగర్, హైదరాబాద్ - 44.
ఫోన్ : 7618261, 7653348

**మూల్యం : రూ. 60/-**

# అక్షరార్పణం



దివ్యమూర్తికి ...



మాతృమూర్తికి ...



అమృత మూర్తికి ...

భక్తితో, గౌరవంతో, ప్రేమతో ...

- కసిరెడ్డి

# స్వగతం

ఎల్లమ్మ (ఎల్లరకు అమ్మ - లోకమాత) దయవీడింది
మాయమ్మ (ద్రౌపదమ్మ) వెళ్ళిపోయింది
అది పుష్య బహుళ చతుర్దశి (2001 జనవరి 23)
నా సగభాగం (కస్తూరిబాయి) పోయింది
అది ఫాల్గుణ బహుళ చతుర్దశి (2001 మార్చి 23)
మూడేళ్ళ క్రితం తమ్ముడు పద్మారెడ్డి పోయాడు
అది ఆశ్వీజ శుద్ధ చతుర్దశి (1998 సెప్టెంబర్ 5)
ఆరేళ్ళ క్రితం తమ్ముడు పర్వతరెడ్డి పోయాడు
అది ఆశ్వీజ బహుళ చతుర్దశి (నరక చతుర్దశి)
కళ్ళముందే చతుర్దశి నాడు ఇందరు పోయి
జీవితాన్ని శూన్యంగా, అమావాస్యగా ఎందుకు మార్చారు?

ఇది విష సూక్తమో
విషాద సూక్తమో
అమృత సూక్తమో ....

ఈ 77 కవితలు కాని కవితలు
భావ శబలిత చిత్రాలు
ఆకృతి ధరించిన ఉపాధి చేసే శబ్దాలు
జడానికి చైతన్యం
చైతన్యానికి స్థిరత్వం
ఈ అక్షర చిత్రాలకిదే పరమార్థం

భాగ్యనగర్
2002 ఫిబ్రవరి 11

- రచయిత

# సాహితీ త్రింశతి

కసిరెడ్డి సాహితీ త్రింశతి ఉత్సవాలు 2001 డిసంబర్ నుండి ఆరుమాసాలు నిర్వహించాలనుకొన్నాం. అందులో భాగంగా **1. శ్రీ భగవద్గీత** సంగారెడ్డిలో, **2. శ్రీ భగవద్గీత ఉపనిషత్తులు** జహీరాబాదులో, **3. నవీన సాహితి** భాగ్యనగర్లో, **4. పీఠికాసాహితి** వికారాబాదులో, **5. పీఠికల పేటిక** తాండూరులో ఆవిష్కరించుకొన్నాం.

ఇప్పుడు వారి **'అమృతసూక్తం'** కసిరెడ్డి సాహితీ త్రింశతి ఆరవ ప్రచురణగా తెస్తున్నాం. ఇందులోని జీవుని వేదన వారిదే. ఇది అనుభూతి కవిత్వమో, ఆత్మాశ్రయ కవిత్వమో, పారమార్థిక కవిత్వమో, ప్రణయ ప్రణవ కవిత్వమో, భావ కవిత్వమో, కాల్పనికవాద కవిత్వమో యోగ్య పాఠక విమర్శకులే భవిష్యత్తులో నిర్ణయిస్తారని భావిస్తున్నాం.

ఈ గ్రంథ ప్రచురణకు, ఇతర గ్రంథాల ప్రచురణలకు సహకరించిన, సహకరిస్తున్న సాహితీ బంధువులందరికీ ధన్యవాదాలు.

భాగ్యనగర్
2002 ఫిబ్రవరి 11

సంయోజకులు
**కసిరెడ్డి సాహితీ త్రింశతి**

# అమృత కిరణాలు


1. విముక్తి ... 1
2. చేతన ... 2
3. బొమ్మ ... 4
4. పారవశ్యం ... 6
5. భావన ... 8
6. అభిరామం ... 10
7. భాసం ... 12
8. మధుభాండం ... 13
9. లయం ... 14
10. అగ్నిమీళే ... 16
11. అమలినా ... 17
12. నన్నూ మననీ! ... 18
13. సున్నాలో సున్నా ... 19
14. లో వెలుగులో ... 20
15. దేహి ... 21
16. నీ కనుసన్నల్లో ... 22
17. చిరకాలం ... 24
18. రససిద్ధి ... 25
19. పద్మపత్రమివాంభసా ... 26
20. స్పర్శ ... 27
21. కారణం ... 28
22. అంకితం ... 29
23. అర్థం ... 30
24. పిలుపుల తల్లపు ... 31
25. నాదాద్వైతం ... 32
26. అభిజ్ఞ ... 34
27. శక్తిమాన్ ... 35
28. చిరంజీవం ... 36
29. లయం! ... 37
30. ప్రాణనాదం ... 38
31. సోకహం ... 39
32. నా కాళ్ళపై నిలబడతా ... 40
33. పూర్ణసిద్ధి ... 41
34. పుష్పరాగం ... 42
35. ఉనికి ... 44
36. దినాంతంలో నీవు ... 46
37. ప్రస్థానం ... 48
38. యుగయుగాల మౌనం ... 49
39. దాసోహమ్ ... 50
40. సుమలత ... 51
41. రౌద్రీ! ... 52
42. ప్ర-యోగం ... 53
43. దౌర్భాగ్యం ... 54
44. పరమార్థం ... 55
45. మాయం చెయ్ ... 56
46. ప్లస్ మైనస్=మైనస్ ... 57
47. ఒయాసిస్సు ... 58
48. అభ్యర్థన ... 59
49. నేనూ-నీవూ ... 60
50. ఆశ్వాసనం ... 61
51. వాగర్థాలు ... 62
52. ముత్యం ... 63

53. అనువికసనం ... 64
54. కమలమయం ... 65
55. అమృతసూక్తం ... 66
56. విరాగిలో రాగం ... 68
57. చింతామణి ... 69
58. పురుషోత్తమ పథం ... 70
59. అమ్మా! ... 71
60. స్పర్శ ... 72
61. గుడ్డిపూవు ... 73
62. వలయం ... 74
63. నీడ-జాడ ... 75
64. ప్రణయ(వ)ం ... 76
65. కల్మషాయత్త కమలిని ... 77
66. ఫలంలో పరమాత్మ ... 78
67. నిత్యసత్యం ... 79
68. కొలమానం ... 80
69. శూన్యంలో చైతన్యం ... 81
70. అనుబంధం ... 82
71. పూజారిని ... 83
72. దీపం ... 84
73. నేనంటే ప్రాణం ... 85
74. పట్టవలసిన పట్టు ... 86
75. చైతన్య ఫలం ... 88
76. నీవాణ్ణి ... 89
77. జీవిస్తా !!! ... 90




# విముక్తి

నీవు అఖండాత్మ పుష్పానివి
ఆ పుష్పం వాడదూ - చెడదూ
పరిమళం వీడదు
నేను ఒంటరి చిన్ని పుష్పాన్ని
ఎప్పుడు వాడిపోతానో తెలియదు
ఇది విచ్చుకొని
పరిమళాలతో ఉన్నప్పుడే
దరిజేర్చుకో !
హృదయంపై దాచుకో!
పోనీ - శిరస్సుపై నుంచుకో!
ఇష్టం లేదా -
కర్ణభూషణంగా మార్చుకో!
హస్తలీలా కమలంగా చేసుకో!
నీ చేతుల్లో ఒక్కొక్క రేకు
రాలిపోయినా నాకిష్టమే
పరిమళం ఆఘ్రాణించకున్నా మానే,
నిత్యకోమలమైన
నీ కపోలాలకీ సుమం తాకకున్నా మానే,
నీ ఆగ్రహానికి గురై
నీ పాదాల క్రింద నలగిపోయినా
ఈ జీవితానికదే రక్తి
రాగరంజిత పాదాల క్రింది అనురక్తి
మళ్ళీ వెనక్కిరాని ముక్తి - విముక్తి

# చేతన

నా 'ఆత్మా నా ఆత్మా'
- అని పిలుచుకొంటున్నాను నిన్ను
నీవు వెలుపల లేవు
నాలోనే ఉన్నావు
ఉండి, నాపై
ఆధిపత్యం చలాయిస్తున్నావు
అందుకే నీవు నా ప్రభువువు
నీ ప్రభుత్వంలో
నీ మాటే నేను వింటున్నా
నా అస్తిత్వాన్ని పోగొట్టుకొంటున్నా
నేను నేనుగా లేను
నాకిది పరమానందంగా ఉంది
కాని.
అనాగరికత - కుసంస్కృతి
నన్ను నీకు బానిస అంటున్నది
'వ్యక్తిత్వం లేదు
స్వాభిమానం లేదు
అహం-కారం లేదు
అహం-భావం లేదు'
- అని కుటిలంగా హింసిస్తున్నది



హృదయపుష్పంపై
సమ్మోట ప్రయోగిస్తున్నది.
ఈ కుటిల ప్రయోగాలకు
గుండె కొండనుండి
లావా చిమ్ముతున్నది
అది లావా కాదు
లాక్షారసం సుమా - అంటూ
లాలిస్తున్నావు నీవు.
ఆసురీశక్తి ముందు తలవంచితే
అస్తిత్వం పోతుంది గానీ
నేనూ - నీవూ కలిస్తే
నీవు నీవుగానే
వెలుగుతావని ఆశీర్వదిస్తున్నావు
సోఽహం - అంటూ
సాగమంటున్నావు
నీవు నాలో ఉంటూ కదలిస్తున్నావు.
ఇప్పుడు
నేను నేనుగానే ఉన్నాను
కాని,
నా ప్రతి కదలికకు
నిన్నే
చేతనగా భావిస్తున్నాను
నా తనువులోని అణువణువున ఉన్న
దివ్య చేతనతో భాసిస్తున్నాను !

# బొమ్మ

ఓ ప్రియాత్మా! దివ్యాత్మా!
కళ్ళు విచ్చుకొని
నీ వైపు అలాగే చూస్తుంటాను / నీవి పెద్దకళ్ళు
'ఆ కళ్ళు నావైపోతే'
నాది ఎంత పెద్దాశ!
సూర్యచంద్రులైన ఆ కళ్ళు
లోకక్షేమానికై ఉంటే
అన్యాయం జరిగినప్పుడు
ఒకటి ధర్మాగ్రహం ప్రదర్శిస్తుంటే
అనురాగం పెరిగినప్పుడు
మరొకటి దయామృతం వర్షిస్తుంటే
ఆగ్రహానికి చలిస్తాను
అనురాగానికి పరవశిస్తాను



నా చలనానికి
నా పరవశానికి
కారణం నీ కళ్ళే
ఏనాడు వాటిని నేను
విప్పారిన కళ్ళతో చూశానో
ఆనాటి నుండి నాలో ఒకే మథనం
ఆ మథనం నుండే
ఈ అమృతోద్భవం
ఇది ఇలాగే ఉండనీ
వేకువై రానీ
వెన్నెలై పారనీ
నీరై పొంగనీ
నిప్పయి వెలగనీ
గాలయి గమించనీ
మట్టిలో మొలక కానీ
నీ కంటి వేడితో . . . చల్లదనంతో
నేను పిండి పోసుకోనీ
రసాయనం కానీ
నా పుష్టికీ - తుష్టికీ
నీ కళ్ళనే నిలువుటద్దంగా చేసెయ్
అందులో నా బొమ్మను నిలుపుకొంటా!
నీ బొమ్మను చూసుకొంటా!!

# పారవశ్యం

నిన్ను ఛందంలో బంధించాలని
నేను కలం పట్టాను
నేను ఆధునిక ఛాందసుణ్ణి కాను
లయాతీతవు నీవు లయలో ఇముడుతావా!
అందుకే నా గళం - కలం
స్వచ్ఛందంగా సాగిపోతున్నది
నిన్ను అలంకారంలో కుదిద్దామని
కుంచెనెత్తాను
అలంకారాలకే అలంకారం నీవు
నా భావ చిత్రానికి అతీతంగా
లావణ్యరసాత్మకంగా ఉన్న నిన్ను
ఎలా కుదించేది - కుదిరించేది
అందుకే నా కుంచె
నిసర్గంగా సాగిపోతున్నది
నిన్ను నా సంగీత వాహినిలో



ముంచెత్తాలని జంత్రం కదిపాను
కృతిరాదు
నోట కూనరాగం కూడా పలకదు
అందుకే జావళీ కాదు.
నా జానపదంలోనే ఈ గీతం సాగిపోతున్నది
నిన్ను శిల్పంగా తీర్చిదిద్ది
జీవం పోయాలని ఉలి పట్టాను
కళ్ళముందు నీ రూపమే మెదులుతుంటే
శిల బొమ్మగా మారడం లేదు
ఉలి తాకిడికి నీకు గాయమైతే
అన్న భావనతో
ఆ రాయిలో దాగి ఉన్న నీ మూర్తికి
దాసోహమంటున్నాను . . .
నా ఈ భాగవత మార్గం
నీ విషయంలో ఇలాగే
అందంగా - అమలినంగా
శాశ్వతంగా ఉండిపోనీ
అది కలంలో పారనీ
అది అలంకారంలో కూరనీ
అది సంగీతంలో శ్రుతించనీ
అది శిల్పంలో ధరించనీ
నీలో లయించనీ
పరవశించనీ . . .

# భావన

నా ప్రియాత్మా!
ఇన్నాళ్ళూ
నీవు నా పక్కనే ఉన్నావు.
కాదు కాదు
నాలోనే ఉన్నావు.
నేనెంత వెర్రిబాగులవాణ్ణి!
నిన్ను గుర్తించనే లేదు!
నా శరీరం మలినమవుతున్నా
నా మనస్సు నిర్మలంగా ఉండడానికి



కారణం నువ్వు.
కాలుష్యం చర్మాన్నే స్పృశిస్తుందిగానీ
నా మనస్సును కాదు.
అది కల్లోలినే!
క్షణక్షణానికి కల్మషాత్తమయ్యేదే!
కానీ, నీవక్కడ
స్ఫటికంలా ఉన్నావు.
చిల్లగింజలా ఉన్నావు - అందుకే
నా మనస్సు జలం
ఎప్పుడూ స్వచ్ఛంగానే ఉంటుంది.
బురదలాంటి - ఈ
భౌతికదేహంలోని
కుమ్మరిపువ్వు నా మనస్సు.
సంగ శరీరంలోని
నిస్సంగం నా మనస్సు.
దీని పవిత్రతకు కారణం
నీవు నా పక్కనే ఉండడం.
కాదు కాదు -
నా మనస్సులోనే ఉండడం
ఇంత పుణ్యానికి ఒడిగట్టిన
నీకు నేనేమిచ్చేది
ఈ మనస్సు తప్ప. . .

# అభిరామం

మహాత్మా! ప్రియాత్మా!
నేను మంచికొరకే కదలుతుంటాను
మంచికే కదలిస్తుంటాను.
కదలినా కదలిస్తున్నా
అంతా నేనే అనుకొంటాను
క్షణక్షణానికి
డీలా పడతాను,
అప్పుడు నేనేమయ్యానో
నాకే తెలియదు,
నీవు నాలో ప్రవేశిస్తావ్
నన్ను కదలిస్తావ్
కార్యాలవైపు పరుగెత్తిస్తావ్
నా సమీపంలోని నీవు
నాలోనికెలా వచ్చావ్
కార్యాచరణలో లీనమవుతూనే
ఆలోచిస్తుంటా!
నీవున్నావా! లేవా!
ఉంటే స్థూలానివా! సూక్ష్మానివా!



స్థూలం ప్రవేశించలేదు.
సూక్ష్మానికి భౌతికతలోకి
వెళ్లే శక్తి మాత్రమే ఉంది
మరి నీవెవరు?
స్థూలానివి కావు
సూక్ష్మానివి కావు
కారణానివి,
అందుకే లోన ఉన్నావ్
దృష్టికి గోచరమవుతున్నావ్.
- అందువల్ల స్థూలానివి
స్పృశిస్తున్నావ్,
- అందువల్ల సూక్ష్మానివి
నా నీ భేదం లేని
ఆత్మవై పోయావ్,
- అందువల్ల కారణానివి
కారణం కదిలిస్తుంది
సుక్షేత్రాన్ని
సుజలం చేయుమంటుంది
సుఫలం చేయుమంటుంది
సస్యశ్యామలం చేయుమంటుంది
అందుకే శ్యామవు నీవు
రామవు నీవు
అంతా అభిరామం
లోకమంతా అభిరామం

# భాసం

నేను మందుణ్ణి
దుర్మదాంధుణ్ణి
ఊహల బరువు కొండంతయి
ఊరిపోతుంటా
ఉసూరుమంటుంటా
అప్పుడు
నీవు కరుణిస్తావు
నీ చేయి ఆసరాగా ఇస్తావు
ప్రియా! ప్రియాత్మా!
నా చేయి వదలకు
నేను మళ్ళీ మందుణ్ణయిపోతా
దుర్మదాంధుణ్ణయిపోతా.
నీ స్పర్శాసుఖంలో నేనున్నంతవరకు
నేను నీవుగా భాసిస్తా
నీ చైతన్యంతో జీవిస్తా
నిన్నే నేను సృష్టిస్తా,
నీలోనే లయమైపోతా



# మధుభాండం

నా జీవన పాత్ర
ఖాళీ అయిపోయి చాన్నాళ్ళయ్యింది
ఇది నింపేవారేరీ!
నీవు పూర్ణమవు
పూర్ణం నుండి కొంత తీసి
నాలో నింపినా
నీ పూర్ణత్వానికి భంగం రాదు
పూర్ణం నుండి పూర్ణం పోయినా
పూర్ణం పూర్ణంగానే ఉంటుందని
ఉపనిషదుక్తిగదా!
ఉపనిషదం అంటేనే
సత్యానికి సమీపంలో ఉండడం
ధర్మానికి దగ్గరగా ఉండడం
సత్యమే ధర్మం - ధర్మమే సత్యం
సత్యధర్మాలే దైవం
ఓ దైవమా!
పూర్ణమా! పరిపూర్ణమా!
నా జీవనపాత్రలో చేరిపో!
నన్ను మధుభాండంగా మార్చిపో!!

## లయం

~~ఈ~~ఈ శిశిరం ఇంకా ఎన్నాళ్ళో!
ఈ స్థూలంలో
చేతన ఉన్నన్ని నాళ్ళూ!
ప్రశ్న - ప్రశ్నమీద ప్రశ్న
పరుగెత్తుతున్నా
పదిమందిని వదిలి - పదిమందిలోకి,
మందిని వదిలినప్పుడు
శూన్యంలోకి చూస్తున్న ఒంటరిని ...!
నిశ్శబ్దంగా నిశీధి నడచిపోతుంది
పదిమందిలోనూ
నేను ఒంటరినైపోతా



ప్రహసనాలకూ - ప్రలోభాలకూ
దూరంగా ఉండిపోతా!
కాని - ప్రియాత్మా!
ఆ నిశ్శబ్దంలో
ఈ జనారణ్యంలో
ఎప్పుడో
నీవు నన్ను స్పృశిస్తావు
నిద్రాముద్రిత స్థితినుండి
భద్రలోకాల్లోకి తీసుకొనిపోతావ్
అంతర్బహిస్సత్వం - సత్యం నేనేనంటావ్
సత్యం - శివం - సుందరం
నా ప్రియాత్మ అనే భావన నాకు కలిగితే
నేనో నరేంద్రుణ్ణవుతా
నేనో రామతీర్థుణ్ణవుతా
నేనో అరవిందుణ్ణవుతా
ఆధ్యాత్మిక కేతనమవుతా
విశ్వవ్యాప్తమవుతా
జగదాత్మనవుతా
నన్ను విశ్వాత్మగా చేసిన
ఈ శక్తి నీది - ఈ రక్తి నీది
అందుకే నా కార్యాలన్నీ
నీకే అర్పిస్తా
నీలోనే లయమవుతా !!

## అగ్నిమీళే

నేను హిమాలయాన్ని
మహిమాలయాన్ని
- అని గర్విస్తున్నా
కాని - నీ ఉష్ణకర స్పర్శకు
కరగిపోతున్నా!
అవును
ఇప్పుడనిపిస్తున్నది
నేను ఘృతకుంభాన్ని
నీవు నన్ను స్పృశించే
'అగ్నిమీళ'వు
అందుకే పరిమళిస్తున్నా!
పారిపోతున్నా!

నేను దూదికొండను
నీవు వేగంగా తాకే గాలివి
నేను నేనుగా లేను
లేచిపోతున్నా!

నేను వేడి తాకిడికి
ఆవిరైన అంబుధి జలాన్ని
అలా ఆకర్షణ పరిధి దాటుతున్నా -
కాని నీ శీతల స్పర్శ
నన్ను క్షేత్రాలపై
కురిపిస్తున్నది -
జడిపిస్తున్నది -
తడిపిస్తున్నది
అగ్ని అప్ప(నీరు)య్యింది
అమృతమయింది



## అమలినా!

నాలోకంలో నేను
నా కళ్ళముందొక ధ్యేయవాదం
అదీ ఒక యోగం
నిజంగా కర్మయోగం
నేనందులో శిథిలమై పోతుంటా
ప్రియాత్మా! మమాత్మా!
ఎప్పుడో టక్కున నీవు గుర్తొస్తావ్!
లేచొచ్చి నీ ఒళ్ళో వ్రాలాలనిపిస్తుంది
అలా చేస్తే
నీవు మలినమవుతావ్
నీవు మలినం కావడం
నా కిష్టంలేదు
మనది
అమలిన శృంగారం
నీ ఆత్మే నాకు బంగారం
అది నా గుండె లబ్‌డబుల్లో ఉంది
అంతేచాలు
ఈ జన్మకదే పదివేలు

# నన్నూ మననీ !

ఓ సర్వజ్ఞ శక్తీ!
నేనప్పుడప్పుడు గానం చేస్తుంటా
ఇవి పిల్లపాటలు
నీదేమో విశ్వగానం
తెలిసి సిగ్గిల్లుతుంటా!

నేనప్పుడప్పుడు కవితలు వ్రాస్తుంటా
ఇవి పిచ్చిగీతలు
నీదేమో విశ్వరచన
మౌనంగా ఆరాధిస్తుంటా!

నేనప్పుడప్పుడు చిత్రాలు వేస్తుంటా
ఇవి అస్పష్ట రేఖలు
నీదేమో విశ్వచిత్రణం
ఈ ఆకృతిని అందులో అన్వేషిస్తుంటా!

నేనప్పుడప్పుడు చిందులు వేస్తుంటా
ఇవి తప్పటడుగులు
నీదేమో విశ్వతాండవం
అడుగులో అడుగు వేయలేకపోతుంటా!

నా సృష్టికి నేనే అహంకరిస్తుంటా
ఇది నిలువని మిథ్యాప్రపంచం
నీది సత్యం శాస్త్ర సమ్మతం
ఆ సత్యశాస్త్ర ప్రపంచంలో నన్నూ మననీ!
నీతోపాటే నన్నూ శాశ్వతగానం అననీ!!



# సున్నాలో సున్నా

నాకొఅకు నాలో ఉన్నావా
నీ కొఅకు నాలో ఉన్నావా
నా కొరకే అయితే
నీదే బాధ్యత
నీకొరకే అయితే
నీదే బాధ్యత
నేను నిమిత్తమాత్రుణ్ణి
నీ ఆజ్ఞాబద్ధుణ్ణి
నాలో లోగుండెలో
నీ ముద్ర ఉంది
అది చెదరకుండా
చూసే బాధ్యత నీదే
నీ భక్తుణ్ణి
నీలోని వాణ్ణి
అని నీవు భావిస్తే
నీవు నాలో ఉన్నట్టు
నీ ముద్ర చెదరకుండా ఉన్నట్టు
నీవే చెదరితే
నేనుండను
నీవెక్కడుంటే అక్కడే నేనుంటా
నిన్ను నిరంతరం ధ్యానిస్తుంటా
నీలో నేనుండిపోతా!
నాలో నిన్నుంచుకొంటా!!

# లో వెలుగులో . . .

నా దేశమే నాకు దైవం
ఆ దైవాన్నే ఉపాసించే పూజారిని నేను
నిశ్చయాత్మక బుద్ధి అటువైపే
దైవంలేని దేశమెక్కడున్నది అంటూ
నా ముందుకు వస్తావు
దేశాన్ని ఆవరిస్తావు
ఆవరించింది మాయనా
దేశం మాయనా
దేశం మాయ అయితే
నా అస్తిత్వం శూన్యం
నాకు అస్తిత్వమే లేకపోతే
నీ బొమ్మ నాలో నిలువదు
నీ బొమ్మ నాలో ఉండాలి
అది మాయ కాదు
అది వెలుగు
ఆ వెలుగులో
నా దేశాన్ని చూడాలి
నా దేశంలో నీ వెలుగుండాలి
దేశం - నీవూ అంతా అద్వైతమే
నాలోని నీవే దేశం వెలుగైనప్పుడు
నేనెవరిని?
నేనూ వెలుగునే
నీవిచ్చిన వెలుగునే
నేను నీవే, నీవు నేనే
నేనూ నీవూ దేశమూ . . . అంతా ఒకటే



# దేహి

నిన్ను 'దేహి' అనకుండా
నా బ్రతుకు పాత్ర ఎప్పుడూ పండదు
నీవున్నది ఇవ్వడానికి
నేనున్నది స్వీకరించడానికి
నాకు రుచినిచ్చావు
నా వాక్కుకు శుచినిచ్చావు
నా చెవులకు శ్రుతినిచ్చావు
కళ్ళకు కాంతినిచ్చావు
నాకు ఊపిరిపోసి చైతన్యాన్నిచ్చావు
అయినా నీవు తరగలేదు - కరగలేదు
పిడికెడు మట్టితీస్తే
భూమికేమవుతుంది!
దోసెడు నీళ్లు పోతే
సముద్రానికేమవుతుంది!
నా బ్రతుకు పాత్ర మాత్రం
తరుగుతుంది . . కరుగుతుంది
మళ్ళీ 'భిక్షాందేహి' అంటాను
నీ దయార్ద్ర నయనాల కాంతిబాట
ఈ పాత్రా పూర్ణమవుతుంది
నేనూ పూర్ణమవుతాను

# నీ కనుసన్నల్లో ...

నీకళ్ళల్లో
నేనెప్పుడూ కన్నీరు చూడలేదు
సూర్యకాంతినీ చంద్రుని వెన్నెలనే చూశాను
కాని ఈనాడిదేమి
కన్నీరు మున్నీరులా!
ఆకాశమనే సుందర ఛత్రం క్రింది
సూర్యగోళం చంద్రగోళం
ధారాపాతంగా వర్షిస్తున్నాయి.
స్వాభిమానం స్వాతిశయం స్వశక్తి
తొణికిసలాడే ఆ గోళాలపై
నల్లని మేఘాలు కుప్పలు తెప్పలై
అలా ముసురుకున్నాయేమిటి!
అనురాగం ఆత్మీయత
ఒలికే ఆ కళ్ళల్లో
ఒక్క నీటిచుక్కా నేను చూళ్ళేను.



నన్ను నడిపించే నీ శక్తి
ఇలా నీరై పారడం నేను సహించలేను.
ఇంతకూ ఈ కంటినీరు
నీది కాదు
అది నాదే
నా దృష్టితో నిన్ను చూస్తున్నా
నన్ను మాయ ఆవరించింది
మాయాతీతవు నీవు
మాయావరణం నన్ను వీడిపోయిన వెంటనే
నీవు సూర్యకాంతినీ చంద్రుని వెన్నెలలను
వెదజల్లుతూనే ఉన్నావు
నీవు నీవే
కాని నేను నేను కాను
నిన్ననుసరిస్తాను
నీవే నేను కాగా
నిరంతరం తపిస్తాను - జపిస్తాను
ఆ కళ్లు కాంతిమంతాలై ఉండాలనే ఆశిస్తాను
వార్షుకాభ్రాలు కాకూడదనుకొంటాను
నేను నిరంతరం ఆ శాశ్వత కాంతిలో
తేజస్వంతమై భాస్వంతమై శ్రీమంతమై
ఉండాలని ఆశిస్తాను
నీ కనుసన్నల్లో జీవిస్తాను - మరణిస్తాను

# చిరకాలం

ఆ మబ్బుతునక ఎంత బాగుంది అని
అలా చూస్తూనే ఉంటాను
తునక మాయమవుతుంది
మబ్బుల పందిరివై నీవు నన్ను కప్పేస్తావు

ఎన్ని పూలగుత్తుల మొక్కలో
అన్నీ మరచిపోతాను వాటిని చూచి
కొమ్మలు రెమ్మలు నీవై
ఆకులన్నీ నీ వస్త్రాలై
పూలన్నీ చుక్కలై అక్కడ నీవు దర్శనమిస్తావు
కళ్ళల్లో నిలిచిపోతావు

ఆ కాల్వగట్టున
ఎంతకమ్మని నీటితుంపర
నన్నావరించిన చల్లదనం
నీవు ఆక్రమించుకొంటావు
నీ నును వెచ్చదనంతో
వేడినురుగై నన్నుడికెత్తిస్తావు
మల్లె మొగ్గల్లాంటి అన్నంలో నువ్వే
మలినం లేని మనస్సులో నువ్వే
నింగిలో నువ్వే - నీడలో నువ్వే
నువ్వుండగా నాకేం తక్కువ
నీ అడుగులో అడుగు వేస్తూ
నీలాకాశమై పోతా
నీరై పారిపోతా
నవ్వు వెన్నెలై చిరకాలం జీవిస్తా.



# రససిద్ధి ?!

రసోవై సః కదా
బ్రాహ్మీ ముహూర్తంలో
రామా రామా అని పిలుచుకొంటూ
తలచుకొంటూ
రసరమ్యలోకాల్లో విహరిస్తా
ఈ ముహూర్తంలో
నీకొరకు నేను చేస్తున్న తపస్సు
ఫలించేదెప్పుడు!
రససిద్ధి పొందేదెప్పుడు!!
తపస్సు సంకల్పాన్ని స్థిరీకరిస్తుంది
జ్ఞాననేత్రం తెరుస్తుంది
అంతర్గత సంస్కారం పైకి ఉబికితే
కళ్ళు బొమ్మ నిలిపితే
చెవులు శబ్దాన్ని పట్టితే
నాసిక గంధాన్ని గ్రహిస్తే
చర్మం స్పృశిస్తే
రసన ఆస్వాదిస్తే
వీటి నన్నిటిని మనస్సు నిలిపితే
హృదయం ఆర్ద్రమై స్పందిస్తే
తరంగాల భావాలు సముద్రంలా నిలిస్తే
ఫలించేదప్పుడు!
రససిద్ధి పొందేదప్పుడు!!

# పద్మపత్రమివాంభసా

నీవెప్పుడూ నాకు
పులుగడిగిన ముత్యంలా కనిపిస్తావు
నేను నా సంచితంతో
దీన హీన మానవుల్లో తిరుగుతాను
నాది వారి కంటిస్తాను
వారిది నేనంటించుకొంటాను
నీవూ ఈ మార్గంలో తిరిగే ఉంటావు
నీ పాదపద్మాలపై
ఆ మెరిసే బిందువులే చెబుతున్నాయి
అవి వారి కన్నీటి చుక్కలు
ఆ పద్మాలపై చేరి
మిలమిల మెరుస్తున్నాయి
ఆ మెరుపు నీవల్లనే సుమా!
అవి నిన్నంటుకోడం
మహాపాపంగా కొందరు భావించి
నిన్నారడి పెడుతున్నారు
పద్మపత్రమివాంభసా అన్నది
తిక్కయ్యలకేం తెలుసు
ఆ బిందువులో దైవహృదయమున్నదని
ఆదిశంకరులన్నారు
మా కవిచక్రవర్తి అన్నారు
పులుకడిగిన ముత్య సదృశ పద్మమా!
ఇక ఆ బిందువును నేనే
ఓ నవనీత పద్మమా! పద్మమా! పద్మమా!



# స్పర్శ

అంతలేసి నీ కళ్ళు!! ఓహ్
నేను వాటినే చూస్తొన్నా
నా కళ్ళు విప్పారినై - కాని నీ కళ్ళు
సూర్య చంద్రగోళాలు
ఉష్ణాలు కవోష్ణాలు రుధిరోష్ణాలు
వెన్నెలలు కమ్మని వెన్నెలలు రమ్మనే వెన్నెలలు
రెండింటికీ మూలం ఒక్కటే
బాహిర ప్రకటనంలో
లోకం భేదం చూస్తుంది
అది అగ్ని - అది జ్యోతి
స్పర్శద్వారా గాని
అది ఏదో అర్థం కాదు
ఈ విప్పారిన కళ్ళు
ఆ స్పర్శకే ఎదురుచూస్తున్నాయి
ఇవి అగ్నులై మండుతున్నాయి
జ్యోతులై వెన్నెలలు కురిసేదెప్పుడో!
నీ జ్యోత్స్నామృతం
నన్ను స్పృశించేదెప్పుడో !!

# కారణం

ఈ స్వప్నలోకం
ఎంత మధురంగా ఉంది
నా మనస్సు నా ఇష్టం
ఇష్టం మనస్సులోనిదే అయినా
మనస్సుపై ఆధిపత్యం వహిస్తున్నది,
వెలుపల ఉన్న నిన్ను
లోపలికి తెస్తున్నది
అంత స్థూలమైన నీవు
సూక్ష్మమవై
నాలో ఒదిగిపోయావు
ఇప్పుడు నేను నేను కాను
నా మనస్సు నాది కాదు
నన్ను కదిలించేది నీవే
నన్ను కవ్వించేది నీవే
నన్ను కరుణించేది నీవే
ఇప్పుడిక సూక్ష్మానివి కాదు
కారణానివీ నీవే



# అంకితం

ఈ నా పాట
నీకు అంకితంగా ఇవ్వాలని ఉంది
ఈ నా ఆట
నీ ముందు ప్రదర్శించాలని ఉంది
ఈ నా మాట
నీ మనస్సులో ఊదాలని ఉంది
నీవే ఇచ్చిన
పాటా - ఆటా - మాటా
నీకు కాక
మరెవరికి సమర్పించేది?
నా ఈ జీవన పుష్పం
ఇప్పటికే
వాడివత్తలై జీర్ణశిథిలమై
సౌందర్యాన్ని కోల్పోయి
ఇక ఎంతోకాలం నిలవనంటోంది!
ఈ చివరిరోజుల్లోనైనా
నన్ను నీకై అర్పించుకొంటా!
భౌతికరూపం వ్రయ్యలైనా
ఆత్మసుమ పరిమళం
వాడదు వీడదు కదా!
నీవిచ్చినదదే
మిగతాదంతా ప్రారబ్ధం - సంచితం
నీది నీకే అంకితం

# అర్థం

నిద్ర నుండి లేచి
నేను కళ్లు విప్పగానే
ఎదుట నువ్వే కనిపిస్తావు
నిన్ను నాలో కలుపుకొందామని
చేతులు చాస్తాను
బట్టబయలూ - శూన్యం
నీ ఇంటికై అన్వేషిస్తాను
అదే నీ ఇల్లనుకొని
నీ అనుమతికై నిరీక్షిస్తాను
నీ ప్రసన్నత నిమిత్తం
మాటా - పాటా - ఆటా
అన్నీ చేస్తాను
కానీ నీవు కదలవేమి!
నన్నాలింగనం చేసుకోవేమి?
అలా నవ్వుతావేమి!
నీవు కదలవూ
నన్ను కదిలిస్తావు
నీవు బ్రహ్మవూ!
బ్రహ్మ పదార్థానివి!
లేకుంటే
ఎందుకర్థం కావు?
అర్థానికై నీలోన వెతుక్కోనా!
నాలోన వెతుక్కోనా!!



# పిలుపుల తలపు

నీ దరి చేరడానికి
ఏది పవిత్ర ముహూర్తమో
నాకు తెలియదు
పెళ్లి ముహూర్తాలు పెట్టుకొని
పదిమందిని కలుపుకొన్నట్లు,
అన్నం ముహూర్తం నిర్ణయించుకొని
డైనింగ్ టేబుల్ ముందు కూలబడ్డట్టు,
పరీక్ష ముహూర్తం ఏర్పాటు చేసుకొని
పరీక్ష వ్రాసినట్టు.
ఇంటికీ, చెఱువు కట్టకూ
గ్రంథాలయానికీ, విద్యాభ్యాసానికీ
ప్రయాణానికీ - అన్నిటికీ ముహూర్తమే
ఇది పరమగమ్యం
ఇది మహాప్రస్థానం
దీనికి కూడా ముహూర్తమా!
నీవు సృష్టించిన ప్రతిక్షణం పరమపవిత్రమే
ఈ సృష్టిలో లయం కావడానికి
నేను సిద్ధం,
నీవు చేతులు చాచావనిపిస్తే చాలు
ఆ చేతుల్లో
వ్రాలిపోవడానికి
నేను సర్వదా సంసిద్ధం

## నాదాద్వైతం

అబ్బో! ఎంత జనం!
ఇంత జనాన్ని ఎందుకు చేర్చుకొంటావో
నీవు సృష్టించిన వారు
నీ దగ్గరికి రాక ఎక్కడికి వెడతారు



కాని, నేను
వీరెవరూ లేనప్పుడు
ఏకాంతంలో
నీ అంతఃపురంలోకి రావాలని ఉంది
ఈ విశ్వవికాసంలోకి
నన్ను విసరివేసి మరచిపోయావు
నీనుండి వచ్చిన నేను
నీలోనికే రావాలనుంది
ఈ ఆకాంక్ష నీకు తెలుసు
మరి అంతమంది ఉంటే
నేను నీలోకి వచ్చేదెలా!
ఈ మ్రోగే విపంచికా నాదాన్ని
నీ అంతరంగానికి అందించేదెలా!
ఇక ఏదీ చూడను!
నాకు నీవు తప్ప మరేదీ కనిపించడం లేదు
నేను వచ్చేస్తున్నాను
నీ ద్వారాలు తెరువు
నీ అమృత హస్తాలు చాచు
ఆ భాహువుల్లో ఒదిగి
ఆ హృదయంలో చొరబడి
నా విపంచిక వినిపిస్తాను
నా నాదం
నీ నాదం
ఒకటే అని నిరూపిస్తాను

# అభిజ్ఞ

నా గుండెల్లో కోటి వీణలు మ్రోగుతున్నాయి
నా నాడుల్లో వేల నదులు ప్రవహిస్తున్నాయి
నా ఊహల్లో లక్షల తరంగాలు సుడిగొంటున్నాయి
నా కళ్ళల్లో ఒకే అఖండకాంతి జాజ్వల్యమానమై నిలిచుంది
నా చెవుల్లో శతాబ్దాల శబ్దం నాదమై మ్రోగుతుంది
ఈ సర్వ సంచలన స్థితికి కారణం నీవే

నీవే కారణమైనప్పుడు ఎందుకు వీటికి సంయమనం నేర్పవు?
ఇవి విజృంభిస్తే - ఇరుగుపొరుగులను మ్రింగేస్తే
అది ఎవరి తప్పు! నీదా నాదా!
కదలిక నాది - కదలించేది నీవు
నీవు కనిపించవు - నేను కనిపిస్తాను
లోకం వ్రేలెత్తేది నా వైపే
నన్నెందుకు కదలిస్తావు
నలుగురిలో నగుబాటెందుకు చేస్తావు?

నన్ను కదలించు, కానీ
ఈ భౌతిక జగత్తుకై ఉపయోగించకు
నీ పాదసేవకై ఉపయోగించుకో
నీ ప్రతిబింబంగా - కాదు నీవే అన్నట్టుగా
ఈలోకం గుర్తించేట్టు తీర్చిదిద్దుకో!
ఆర్తితో అద్దుకో!!



# శక్తిమాన్

నాకు ప్రతిక్షణమొక యుగం
నా మనస్సెప్పుడో నీకు సమర్పణం
నన్నెందుకో నలుగురు పిలుస్తారు
నీ పిలుపు వినాలనుకొనే నన్ను
ఈ నలుగురెందుకు పిలవాలి!
నాకు వారివెంట వెళ్లాలని లేదు
ఈ భౌతిక ప్రపంచం మీద
ఇంకెన్నాళ్ళీ నటన
శాశ్వత సత్యం నీ ఒడి
నేను అలసిపోయాను
నీ ఒళ్ళో హాయిగా నిద్రపోవాలనుంది
అయితే
అది శాశ్వతనిద్ర కావాలనే కోరికలేదు
వెచ్చని నీ ఒడి
నాకు చైతన్యాన్ని ఇస్తుంది
శక్తినిస్తుంది
నీ కరస్పర్శతో
నాలో విద్యుత్తరంగాలు ప్రవహిస్తాయి
ఈ నటనా ప్రపంచంలో పడకుండా
నన్ను నీవు పిలవు
ఈ అలసటంతా నీ దగ్గర తీర్చుకొంటాను
"శక్తిమాన్"గా పునర్జన్మ నెత్తుతాను

# చిరంజీవం

నేనిప్పుడొంటరి వాణ్ణి
నాకందరూ ఉన్నారు
తల్లీ తమ్ములూ చెల్లెళ్ళూ భార్య పిల్లలూ
వాళ్ళెవరికి వారే
వారికి నేను కావాలి
కానీ నా అవసరాలేవీ వారికి తెలియవు
నాకేం కావాలో వారు చూడరు
నేను సర్వశక్తిమంతుణ్ణి అనీ
నాకు కావల్సినవి నేనే సమకూర్చుకొంటాననీ
వారెవరూ నన్ను పట్టించుకోరు ...
నేను నీ వైపు చూస్తుంటాను
నీచుట్టూ కారుమొయిళ్ళున్నాయి
అయినా నీవందులో వెలుగుతున్నావు
నీలాల నింగిలోని నీ స్మితాననం
నేను చూచిన ప్రతిక్షణంలో అలానే... అలానే
అలానే ఉండనీ
నన్నెవరూ పట్టించుకోకున్నా పర్వాలేదు
ఆ నవ్వు మాయనీకు
ఆ నవ్వే నాకు జవం జీవం
ఆ నవ్వున్నంత కాలం నేనుంటాను
అది మాయమైపోతే నేనూ మాయమైపోతాను



# లయం!

నిన్ను చూస్తాను
మూగినైపోతాను
చూసేవి చక్షువులే కదా!
లోపలి కన్ను కాదు
నక్షత్రాలు నీ కన్నులతో మాటాడతాయి
గాలి నీ శరీరంతో మాటాడుతుంది
ఆకాశం నీ శ్రవణేంద్రియాల్లో ధ్వనిస్తుంది
పూలు నీ జడలో గుసగుసలు పోతాయి
పృథ్వి నిన్ను స్పృశించి గంధవతి అవుతుంది
నాకు నోరు పెకలదు
'మూకం కరోతి వాచాలమ్'
అన్నది సత్యమైతే
నాలోకి రా
తంత్రులు తెగి
మూగవోయిన ఈ వీణను మ్రోగించు
నా జీవితానికి పరమార్థాన్ని ప్రసాదించు
ఈ నాడుల్లో చైతన్యాన్ని పూత్కరించు
చాలు చాలు
నీ అడుగులో అడుగువేసి పయనించే
అవకాశం కల్పించు - నన్ను నీలో లయించు

# ప్రాణనాదం

ఓ ప్రియాత్మా!

పరమాత్మా

హృదయపద్మంలోనే నీవుంటావు కదా!

నీవు గబాలున

ఈ పద్మం రేకులను విప్పుకొని

బయల్లోకి వస్తే

ఈ పద్మం గతేంకాను?

నీవక్కడే ఉండు

ఆ రేకుల్ని నన్ను స్పృశించనీ

ఆ పుప్పొడిని

నా శరీరమంతా పూసుకోనీ

ఆ మకరందాన్ని

మనసారా గ్రోలనీ

ఈ భ్రమర జీవితం

సార్థకం కానీ

అందుకే

ఈ పద్మం రేకుల్లోంచి రాకు

ఈ భ్రమర నాదాన్ని ఆగిపోనీకు



# సోఽహం

నీవు సత్యం - నేనసత్యం

నీవు శాశ్వతం- నేనశాశ్వతం

నీవు నిత్యం - నేను అనిత్యం

నీవు జ్ఞానం - నేను అజ్ఞానం

నీవు చిన్మయం - నేను జడమయం

నీవు ఆనందం - నేను విషాదం

నీవు చలనం - నేను అచలనం

నీవు ప్రకాశం - నేను అప్రకాశం

నీవు గమ్యం - నేను అగమ్యం

నీవు అమూర్తం - నేను మూర్తం

నీవు నేను ఒకరం కామా!

నీకూ నాకూ ఇంత అంతరమా!

అయితే నీ ధ్యాస నాకెందుకు!

నాలోని 'అహం'ను వదలను

నేను నేనుగానే ఉంటాను

నీవు నీవుగానే ఉండు

అహం బ్రహ్మాస్మి అని చచ్చినా అనను

త్వమేవాహం అని నీవు అనేంతవరకు

నీవు నీవే  నేను నేనే

# నా కాళ్ళపై నిలబడతా

ఈ ఉద్యానవనంలో ఎన్నో పూలు
అన్నిపూలూ కళాజ్యోతులే
తొడిమతో బంధం ఉన్నంతకాలం
జీవచైతన్యాలు ఈ పూవుకుంటాయి
ఈ కటిక చీకటి
జ్యోతినార్పేసి
పూవును త్రుంచేసి
తన సిగన తరుముకోవాలని చూస్తుంది
తల్లి వేరందించే రసానుభూతితో
తన్మయత్వం చెందే నేను
దూరం కావాలనుకోడం లేదు
నీవు శక్తివి
ఆ చీకటి రేఖను
నా దగ్గరికి రానీకు
ఓ భారత సావిత్రీ
ఒక్క కడగంటి అదలింపు చాలు
చీకటి పోతుంది
ఒక్క కడగంటి ఆదరణ చాలు
పరిమళ ప్రకాశమవుతా!
నే విస్తరిస్తా!!
నా కాళ్ళపై నిలబడతా!!!



# పూర్ణసిద్ధి

నీవు గాలివో - కాంతివో
ముద్దు చేసి పట్టుకొందామని ఉంది
ఏదీ పట్టు?
చిక్కదు!
భావనలో పూర్ణం
కైదండలోనూ పూర్ణమే
'పూర్ణమదః - పూర్ణమిదం'
ఇక ఆరాటమెందుకు
అయినా
ఏ నిశాంతంలోనో
నీవు వస్తావని
నా హృదయద్వారాలు తెరచి ఉంచా!
అంతా పూర్ణమే తెలుసు
కాని, అందులో చైతన్యమేది?
అందుకే
ఆ గడపమీద నిలబడి
చేతులు చాచి నిరీక్షిస్తున్నా
సుందర చైతన్యం లేనిది
శివమెందుకని
సిద్ధికోరుతున్నా!
పూర్ణసిద్ధినే కోరుతున్నా!!

# పూపరాగం

"ఇరవైలో నీ అందానికి బానిసను
ముప్పయిలో నీ ఆకర్షణకు బానిసను
నలభైలో నీ అనురాగానికి బానిసను
ఏభైలో నీ ఆదరణకు బానిసను



ఎప్పుడూ నేను నీ బానిసనే"
- ఓ తమిళకవి అన్న ఈ మాటలు
నన్ను నీవైపు మలిపినై
ఏబై దాటాక
నిన్నప్పుడే చూసి ఉంటే అనిపిస్తుంది
ఇరవైలో నా యౌవనానికి నేనే బానిసను
ముప్పయిలో నా వికాసక్రియకు నేనే బానిసను
నలభైలో నా అధికారానికి నేనే బానిసను
ఏభైలో నా రోగాలకు నేను బానిసను
కళ్ళువిప్పితే - అంతర్నేత్రం తెరిస్తే
నిన్ను చూస్తే
నీ అందం ఆకర్షణ అనురాగం ఆదరణ
అన్నీ నన్నిప్పుడు కదలిస్తుంటే
నాలో నేను కుంచించుకుపోతుంటా
నాకు నేనే సేవ చేసుకొంటూ
అందుకోలేని నీ అమృతహస్తాన్ని
ముందు జన్మంటూ ఉంటే
అందివ్వమని అంటున్నా
ఆదుకొని అన్ని వేళలా
నీ బానిసను చేసుకొమ్మంటున్నా!
నా కంటకాకీర్ణ మార్గంలో
పూపరాగం వెదజల్లుమంటున్నా!!

## ఉనికి

నీవే పతివీ గతివీ
సఖివీ సఖుడవు - నా
మాతవూ పితవూ
ఇది నాటి మాట
నేటి మాట - ఆ
రేపటి మాట



కాని నా వేదన
జీవునిది - ఆ
దరి జేరుతుందా!

నీ సనాతనమే
జీవుని రూపమైతే - ఈ
వేదన ఎందుకు?

నీవే అంటుకొని
నిత్యమంటుంటే - ఈ
తపన ఎందుకు?

లోని కారణమై
సూక్ష్మమై - స్థూలమై - ఈ
కదలిస్తావెందుకు?

నిన్ను సతిపతిగా
పతిసతిగా - గతిగా
పిలిపించుకొంటావెందుకు?
అఖండాన్ని నా చేత
ముక్కలు చేయిస్తావెందుకు?

లీల కాకపోతే
ఇదేమిటి
అన్నీ నీవే
నేనూ నీలోనే

# దినాంతంలో నీవు ...

దినం దినమంతా - నేను
అక్షరాల్లో అక్షరమవుతా
గ్రంథాల్లో గ్రంథమవుతా
బోధనలో లీనమవుతా
ఖాద్య పదార్థాల్లో కలిసిపోతా
స్నేహసిక్త హృదయాలతో తడిసిపోతా
మాటల్లో మునిగిపోతా
మనస్సులతో కలిసి వికసిస్తా
    తర్కిస్తా ... చర్చిస్తా ... సంఘర్షిస్తా
    ఓటమినంగీకరిస్తా ... విజయం సాధిస్తా
రేడియోలో పలుకుతా
దూరదర్శన్లో కనిపిస్తా - వినిపిస్తా
నన్ను నేను కావాలనే
ఏ ఒకరి పనికైనా వినియోగించుకొంటా



కాని దినాంతంలో
అలసిపోతా - అలా సోలిపోతా
'కామ్ కర్తేరహో - నామ్ జప్తేరహో'
అన్న మాట అప్పుడు గుర్తుకు వస్తుంది!
ఓ మహాత్మా! ప్రియాత్మా!
అప్పుడు నీవు గుర్తుకు వస్తావు
అంతరాంతరాల్లో ఎక్కడున్నావు
దినమంతా దరికెందుకు రాలేదు
నిద్రాదేవి ఆవహిస్తున్న వేళలో
నీవు వస్తావా!
రా !!
అలసిపోయాను
అశక్తుణ్ణీ - అరక్తుణ్ణీ
ఒళ్ళంతా హూనమై
చల్లని నిద్రతల్లి ఒళ్ళోకి జారుకొంటున్నవాణ్ణి
ఇప్పుడు నీ రూపం ధ్యానిస్తున్న వాణ్ణి
    నీ నామం జపిస్తున్నవాణ్ణి
    కలలో తప్ప ఇలలో చూడలేనివాణ్ణి
    నీ ఇష్టం
    నీ రూపంతో - నీ నామజపంతో
    కళ్ళూ పెదవులు మూసుకొంటున్నా
    కలను కరగించు
    నాకు నీ యోగం ప్రసాదించు

# ప్రస్థానం

ఉదరం వేటలో
కాళ్ళూ చేతులూ కదులుతున్నయ్
మృగంలా పనిచేయడం
ఖగంలా పరుగెత్తడం
పొట్టకొరకు దేవులాట
కోటివిద్యలు కూటికొరకు
యంత్రం పని
ఎదురుతాకిళ్ల
శక్తి ప్రయోగం
దూసుకుపోవడం
విజిగీషా ప్రవృత్తితో అహంకారం
అంతర్మథనం - అశాంతి
ఓ ప్రభూ!
ఈ పనీ పాటా వద్దు
నీ సన్నిధిని నిలుచుంటా!
అన్నం అసలేవద్దు
ఆనందం వైపు నన్ను నడిపించు
స్థూలం నుండి సూక్ష్మంలోకి దారి చూపించు
నీ అనుభూతులు పంచు
బ్రహ్మానందంలో ముంచు



# యుగయుగాల మౌనం

"నాకు దయలేదంటున్నావు
ఎంత అజ్ఞానివి
నీ నాలుక మీద నాట్యమాడుతున్నది నేను
నీ హృదయంలో ఉన్నది నేను
నీ కదలికకు కారణం నేను
నిన్నగాక మొన్న ఒకరిని చూచి
నాపేరు పెట్టి పిలిచావు
నీ పక్కన నేనుగాక మరెవరో ఉంటే
నేనే అనుకొని మనసంతా విప్పిచెప్పావు
నా దయవల్లనే కదా
నీవిలా పలుకుతున్నావు
నేనంతగా నీలో ఉంటే
అంతటా నేనే కనిపిస్తుంటే
నేనే స్వయంగా నిన్ను స్పృశిస్తే, మరి
కదలవేం - మెదలవేం!
పైగా కళ్ళు మూసుకొంటావేం!!"

ఇన్ని ప్రశ్నలకు నేనెలా సమాధానం చెప్పేది
నీ స్పర్శతో కలిగే తన్మయతానుభూతి
నన్ను కదలనివ్వదు - పలుకనివ్వదు
నీలో లీనమయ్యే క్షణంలో ఉన్న
ఈ మౌనం - ఇది యుగయుగాల మౌనం!

# దాసోఽహమ్

నీకటాక్షేక్షణ కాంతితో
నా బాహ్యాన్ని వెలిగిస్తున్నావు
ఆచ్ఛాదనాల్ని దాటి
ఆ కాంతి నన్ను స్పృశిస్తున్నది
ఈ శరీరం పులకిస్తున్నది
బాహ్యస్పర్శే ఇంత మధురంగా ఉంటే
నీ కన్నుల ఆ కాంతి
నా ఆంతరిక కేంద్రకాన్ని స్పృశిస్తే
నన్ను నేను మరచిపోయి
నా ఉనికిని కోల్పోయి
నీకు దాసోహమననా!
'ఇంత కాలం సోఽహమ్ అంటూ
తిరుగుతున్న నన్ను - నా
బాహ్యాంతరంగాలలలో ప్రవేశించి
నీవు వశం చేసుకోవాలనే నేను కోరుతున్నా!
నా అస్తిత్వంతో
నాలో పెరిగే 'అహం'
అజ్ఞానాంధతమస్సులో పడవేస్తుంది
ఈ తమస్ నాకక్కరలేదు
నీ జ్ఞాన కటాక్ష జ్యోతే
నాలోనా బయటా ఆవరించనీ
నన్నీలా నీ ఒడిలో నిదురించనీ ●



# సుమలత

ఓ మమాత్మా! ప్రియాత్మా!
నేనిన్నాళ్లు భ్రమలో ఉన్నా
నన్ను నేనే మ్రానుననుకొంటున్నా
ఇది అచలం సుస్థిరమనుకొంటున్నా
కాని ఇది పరమ అజ్ఞానం
నేను మ్రానును కాను
నేను తీగను - ప్రాకుడు తీగను
పద్మోత్పల మిత్ర ద్యుతులతో
వెలిగే దీపస్తంభంగా చేసుకొని
నేనిప్పుడు ప్రాకుతున్నా
నిన్ను అల్లుకొంటున్నా
నీ చైతన్యంతో - దివ్య కాంతితో
నేను పుష్టి తుష్టి పొంది
కుసుమించాలనుకొంటున్నా
పదుగురికి పరిమళాలు
పంచాలనుకొంటున్నా
అందుకే ఎప్పటికీ నీవు మ్రానువే అనుకొంటున్నా!
ఎప్పుడూ నేను లతలాగానే ఉండాలనుకొంటున్నా!
సుమలతలాగానే జీవించాలనుకొంటున్నా! ●

# రౌద్రీ!

దేవీ దేవీ దేవీ !!!
నీ ఆగ్రహం నాకు నచ్చుతుంది
అది ధర్మాగ్రహమే
కాని దేవీ! నీవు రౌద్రివి
రౌద్రోద్గారివి
అభిషేచనం అందువల్లనే
ఎండిన గుండెలు - మండిన గుండెలు
చల్లారాలనే నీ తపన
అందుకే ధారాపాతం
రౌద్రం నుండి నిప్పుకణికెలు రాల్తాయి
నీటి చినుకులు జార్తాయి
ఒక కంట నిప్పు
ఒక కంట నీరు
ఎవరిమీద ఏది కురిపించాలో
నీకు తెలుసు!
సర్వతంత్ర స్వతంత్రవు
అందుకే అమలినంగా ఉన్నావు
నేను మలినాకృష్టుణ్ణి - నికృష్టుణ్ణి
నీ ఆత్మాంశంగా నన్ను చిత్రించి
ఎందుకీ పతన దిశగా పరుగెత్తించావ్ !
ఒక్క రౌద్రకణిక పడ్డా
ఒక్క నీటిచుక్క పడ్డా
నేను సైట్రైట్ అయ్యేవాణ్ణిగా!



# ప్ర-యోగం

గంగవా
యమునవా
నా భౌతిక నయనాలతో
ఈ రెండు రూపాలు చూస్తున్నాను
కాని సరస్వతీ!
వాటిని చరైవేతి అంటూ
అంతర్వాహినివై నిలిచిన
నీవే కదలికకు ప్రాణం జ్ఞానం
ప్రయాగ - ప్రకృష్టయాగ
కేంద్రకమదేనా!
అందుకే అక్కడే త్రి - సంగమమా!
నాలో నిర్మల గంగ ఉంది
నాలో 'నల్ల' యమున ఉంది
సరస్వతీ!
ఈ దేహంలో ప్రయాగ స్థానమేదీ!
హృదయం 'లబ్‌డబ్' అదే అయితే
నేను జ్ఞాన చరైవేత్తిని కావాలిగా!
దానిని కప్పేసే ఆ భ్రాంతి ఏది!
ఆ భ్రాంతి తొలిగేదెలా!
దేవీ ! సరస్వతీ !
నా గంగను - నా యమునను మలినం కానీయకు!
నన్నొక నిత్య ప్రయాగను చెయ్!
ఇందుకు నీ ఇష్టం నా మీద ఏ ప్ర-యోగమైనా చెయ్!

# దౌర్భాగ్యం

అబ్బ!
ఈ దేహం నిండా తూట్లే
కొన్ని పీల్చుకొంటాయి
కొన్ని జార్చుకొంటాయి
కొన్ని నిలుపుకొంటాయి
దేవీ!
నీవిచ్చిన 'చిత్' గుర్తుంటే
ఏది పీలువాలి
ఏది జారవిడవాలి
ఏది నిలుపాలి
- అనే నిర్ణయం జరిగేది
నేనొక భోగయంత్రాన్ని
తిరగలిలా తిరగడం
రుచి తెలియని తిరగడం
ఓ మమాత్మా! ప్రియాత్మా!! దివ్యాత్మా!!!
నీలో లీనమయ్యే క్షణం
భోగంలోని పరాకాష్ఠ సుఖంకన్నా
వెయ్యిరెట్లు గొప్పదన్న
రజనీశ్‌ను అర్థం చేసుకోలేకపోతున్నా!
నోన్ టు అన్‌నోన్
అనే సూత్రాన్నే మరచిన నేను
నీవు చేయివ్వకుంటే బాగుపడను
చేయిచ్చినా జారవిడుచుకుంటే
ఏమాత్రం బాగుపడను



# పరమార్థం

నేనెంత పిచ్చివాణ్ణి
పురుష సింహాన్ని అని విఱ్ఱవీగుతా
పురుష పదం ఆత్మవాచకమని
తెలియక అహంకరిస్తా
నీవు మృగేంద్రవాహనవని చప్పున గుర్తొస్తుంది
జై భవానీ! శివానీ! మమశక్తి రాణీ - అని
మోకరిల్లిపోతా!
అప్పుడు నీవు నాకు
ఈ స్థూలాన్ని నడుపుతున్న సూక్ష్మంగా కనిపిస్తావ్
ఈ మృగేంద్రాన్ని అణచివేసే
శక్తిస్వరూపిణిగా భాసిస్తావ్!
కాని దేవీ!
నీ స్పర్శవల్ల నాకు శక్తివస్తున్నది
అహంకృత తామసం చోట
శుద్ధ సాత్త్వికం తలయెత్తి నిలుస్తున్నది
నేనిప్పుడు త్రిశూలధారి నవుతున్నా
నీవిచ్చిన శక్తితో త్రిపుర (సాత్త్వీక, రాజస, తామస)
సంహారుణ్ణవుతున్నా
నీ దయాపూర్ణత్వంతో శుద్ధత్వంవైపు సాగిపోతున్నా
ఓ జననీ సర్వశుక్లా!
నేను సర్వశుక్లుణ్ణయిపోతున్నా
అభేదస్థితిలోకి వెళ్ళిపోతున్నా
ద్వైత రాహిత్యమే పరమార్థంగా సాగిపోతున్నా!

# మాయం చెయ్

ఈ వెలుతురెక్కడిది?
ఇది నీవిచ్చినది
నేను చిక్కటి చీకటిని
మళ్ళీ చీకట్లు క్రమ్ముకొన్నాయి
నేనెంత మందమతిని
వెలుతురున్న కాలంలో
నీవిచ్చిన నీ వెలుగులో
నన్ను నేను దిద్దుకొన్నవాణ్ణి గదా!
నీలో చేరలేదు!
నిన్ను అప్పుడు మరచిపోయాను
చీకట్లో తడుముకొంటూ
ఏదో వెదుక్కొంటూ
నా కాలికి బురద అంటించుకొన్నాను
ఇది మలిన కర్దమం
ఇది తొలిగేదెలా?
నీ వెలుతురు మళ్ళీ ప్రసాదించు ప్రియా!
ఈ కర్దమంలో ముసలిపులినై ఉండి
ఎవరికొరకో స్వర్ణకంకణం విసరాలని లేదు
నీ వెలుగు బాహువుల్లోకి లాక్కో ప్రియా!
నన్ను నీ వెలుగులో మాయం చెయ్ సరసహృదయా!



# ప్లస్ మైనస్ = మైనస్

నేను భయపడుతున్న సత్యాన్ని
జంకుతున్న జ్ఞానాన్ని
కదలని మెదలని ప్రాణాన్ని
నేను భయపడుతున్న సత్యాన్ని

కాంతిని కుమ్మరించలేని లోవెలుగును
జవసత్త్వాలుండీ ఉరకని శక్తిని
మూగగా లోలోననే నినదించే వాక్కును
బాహువులు విదళించని దాతృత్వాన్ని
అయోమయం అలముకొన్న చేతనత్వాన్ని
అనుమానం అంటుకొన్న అభిమానాన్ని
రాగం ఉండీ చుంబించలేని రక్తుణ్ణి
త్యాగం ఉండీ కదలలేని అనురక్తుణ్ణి
యాగానికి పూనుకోని యోగాన్ని
సౌభాగ్యాన్ని స్పృశించలేని భోగాన్ని

పంచలేని సౌశీల్యాన్ని
ఫలించలేని సౌజన్యాన్ని
వికసించలేని పుష్పాన్ని
అసలు - శబ్దార్థాల్లో ఒకటి కోల్పోయిన విధురుణ్ణి

అందుకే
భూతాన్ని - వర్తమానాన్ని - భవిష్యత్తును
అన్వయించుకోలేని అనాథుణ్ణి
భయపడుతున్న సత్యాన్ని
జంకుతున్న జ్ఞానాన్ని
కదలని ప్రాణాన్ని ...

# ఒయాసిస్సు

శిథిలబంధం శివారావం రక్తస్రావం
ఛిద్ర సంయోగంలో భద్రంలేని సంసారం
ఎండిపోతున్న నా పెదాల ఏడ్పు చూచి
ఆర్ద్రంగా నవ్వుకొంటున్నావు కదా!
అజరామరం నీ నవ్వు
ఎడారి నా జీవితం
కాని ఆ ఒయాసిస్సు నవ్వే నాకు కావాలి
ఒయాసిస్సు ఆ దేశంవాళ్ళదైతే అవుగాక!
జీవితపుటెడారిలో ఒయాసిస్సు 'చెలి చెలిమె'

పేటెక్కిన తప్తాధరాలతో
పెళుసెక్కిన ధాతుహీన అస్తికలతో
గాజుకుప్పెల కళ్ళతో
ఎండిన తోలు డొక్కలతో
అలమటిస్తున్న నాకు -
అతలాకుతలమవుతున్న నాకు
ప్రియా! అమృత స్యందినీ
ఆనందోద్వేగ సువిశాల రసఝురీ!
నాలో ప్రాణం ఊదు
సుధాబిందు సందోహం నింపు
బాహువుల్లో బంధించు
ముక్తిధామం ముట్టించు
కొడిగట్టిన దీపాన్ని మళ్ళీ వెలిగించు
ఈ శిథిల ఫలితకేశం నీ జ్ఞానమే అని నినదించు



# అభ్యర్థన

మనో మోహినీ! హృదయాంతర్వర్తినీ!
మామకీన అభ్యర్థనను మన్నింపుమా!

- నీ నిర్మలిన స్వాదు గంగాజల భావనాంశుకంతో
కుళ్లూ కుహకాలవిషధూమవాసితాంతరంగాన్ని
వినిర్మల వినీలాకాశంగా తీర్చిదిద్దవా
మామకీన అభ్యర్థనను మన్నింపుమా !

- నీ ద్వంద్వాతీత సమోజ్జ్వల సూర్యచంద్రాక్షులతో
కళ్ళు కరళ్లుగా తెరలు తెరలుగా విస్తరించిన
హృదయధ్వాంతాన్ని చీల్చేయవా
మామకీన అభ్యర్థనను మన్నింపుమా!

- నీ సౌభాగ్య సౌశీల్య సౌజన్య సుమపరాగంతో
మల భూయిష్ఠ మనోజ దుస్సహజ ఛిద్రాన్ని
ఉజ్జ్వలత్ పరీమళావాసంగా మార్చేయవా
మామకీన అభ్యర్థనను మన్నింపుమా!

- నీ వాసనా రహిత నిర్ణిద్ర నిష్కామ కర్మయోగంతో
లౌల్యేంద్రియ సంధుక్షిత ప్రజ్జ్వలత్ చర్మభస్త్రికను
రత్నఖచిత సువాసనా భరిత హంసాసనంగా చిత్రించవా
మామకీన అభ్యర్థనను మన్నింపుమా!

- నీ అచంచల సుస్థిర స్థిత ప్రజ్ఞా శ్రీ చైతన్యంతో
చంచల కేతన పటాంచల స్థిర మోహమానసాన్ని
సమతానంద సత్యశివసుందర ధామంగా శిల్పించవా
మామకీన అభ్యర్థనను మన్నింపుమా!

# నేను - నీవు

నేను
మాసిపోయిన ఉన్మాదగీతాన్ని
మొద్దువారిన దృష్టి బాణాగ్రాన్ని
శ్లేష్మావాసిత నాసిక చంపకాన్ని
అరుచితో అలమటిస్తున్న మాంద్య రసనాన్ని
శ్రుతి గ్రహించలేని నిర్బంధ శ్రవణాన్ని
అనర్గళంగా దూకలేని నినాదాన్ని
భోగరోగనిలయ అసమర్థుణ్ణి
వికారిని అనాకారిని బికారిని
పరమ ఛాందస సనాతనుణ్ణి

నీవు
ఉజ్జ్వలత్ గీతానివి
నిశిత దృక్‌బాణాగ్రానివి
సువాసనాంచిత నాసామణివి
శుచి రుచి స్వాదు రసనానివి
శ్రవణేంద్రియ ధ్వననానివి
నిర్గళోల్లంఘిత నినాదానివి
సౌభాగ్యాంచిత సుసమర్థవు
సాకార సౌందర్యశ్రీవి
చైతన్యాన్విత నిత్యనూతనవు

ఇంతకూ నేనూ నీవూ
నీవూ నేనూ మనం జనం జనం మనం
ఎవరం?
విరాణ్మానవులం



# ఆశ్వాసనం

ప్రళయ ప్రభంజనానికి
వాడివత్తలైన జీవనకుసుమంపై
పన్నీటి మేఘాల ప్రచరింపవా
మున్నీరు కన్నీరు తొలగింపవా

గాఢాంధకార దుర్మద బంధనానికి
గజగజవణకుతున్న జ్వరగ్రస్త దేహంపై
ప్రోజ్వలత్ కిరణాల స్పర్శించవా
ప్రాగ్రూప ప్రణవమ్ము మెరపించవా

ఉస్సురుస్సురని ఉడికించే గ్రీష్మగ్రహానికి
జలకుంభ దేహం పొడిపొడిగ మారగా
జోరువానలు కురిసి తనియించవా
కోరికల గింజలవి పులకించవా

జీబు పొదల్లాంటి రొదల పుకారుల తాకిడికి
మొద్దువారిపోయిన పాషాణ శరీరంపై
ప్రణయాల శ్రీరాగవీణ తంత్రించవా
ప్రాబంధికాక్షర శ్రీల మంత్రించవా

# వాగర్థాలు

కళ్ళు కలిసి ఉన్నాయి
చెవులూ కలిసే ఉన్నాయి
నాసాపుటాలు కూడా
చేతులూ కాళ్ళూ - అంతే
లోన కిడ్నీలూ - అంతే
వీడని జంటలు
ఒకటి డీలాపడితే
మరొకటి కలుపుకు పోతుంది
ఇవి మూలకాలు
మరి మిశ్రమాలుంటాయా?
నీవూ నేనూ మూలకాలమా - మిశ్రమాలమా!
పుష్ప భ్రమరాలేమిటి!
చిలకా గోరువంకల సంగతేమిటి?
శ్రవణేంద్రియాలు రూపాలే
నీవూ నేనూ రూపాలమే
కాని భావన లేక మవుతున్నాయి
భౌతిక రూపం పోయినా
ఈ భావనాద్వైతమేమిటి?
ఇంకేం?
వాగర్థాలు
పార్వతీపరమేశ్వరులు



# ముత్యం

దివ్యాత్మా! నీవు విశ్వాత్మవు
అపార శక్తి సంభూతవు
బ్రహ్మాండ రాజ్యాధినేతవు
అంతరంగ బహిరంగాల్లో
ఎక్కడ ఎప్పుడు ఏది జరుగుతున్నా
చీమ చిటుకుమన్నా
గ్రహించే సర్వజ్ఞవు - శివవు
నీకు భయపడే
ఇన్నాళ్ళు - ఈ
మలిన శరీరాన్ని దాచుకొన్నాను
మాట దాచుకొన్నాను
మనసు మాటున మరెన్నో అణచిపెట్టాను
ఎంత పిచ్చివాణ్ణి
నిఖిలం నీలోనే ఉన్నప్పుడు
నింగి నేలా నీవే అయినప్పుడు
దోసిట్లో గుప్పిట్లో దొంగాటకం దాగుతుందా
కౌటిల్యాన్ని వెలికి రానీయకు
అది అక్కడే అంతంచెయ్
నన్నీ లోకంలో నీయంత దివ్యంగానే
గుర్తుంచుకొనేట్టు చెయ్
మంచి మంచిగానే ఉండనియ్
మంచి వెనుక వంచన ఉందనే
భావన స్థిరపడనీయకు
ముత్యాన్ని ముత్యంగానే ఉండనీ !

# అనువికసనం

ఈ భూమ్మీద పడ్డప్పటినుండి
నీతోనే పోరాటం
పోరాటం కాదు సహజీవనం
మట్టి మడి - నీటి తడి
కాంతి అందం - గాలి గంధం
గగనశూన్యం
అంతా ప్రకృతే,
నీవు విశ్వప్రకృతి
అగ్ని సరస్సులూ, జలవృక్షాలు
భూధర విభూతులు
గాలికోటలు - శూన్యానంతాలు
అన్నీ నీవే అయి
ఎందుకిలా బంధిస్తావు
నిజానికిది బంధనంలా లేదు!
అమ్మ ఒడిలా ఉంది
పరిమళ స్నిగ్ధ కర్దమంలా ఉంది
ఇందులో నిండ మునగాలని ఉంది
నీతో పోరాడాలని లేదు
నిన్ను ఛేదించుకొని
ఆవలి తీరాలకు చేరాలని లేదు
అధిష్ఠాన పీఠంపై ఆశలేదు
నీ ఆత్మీయతా సౌరభేయ బ్రహ్మాండభాండంలో
అణువుకు కూడా అందని నూరో అంశాన్నయి
విస్ఫోటనం చెందాలని ఉంది - నీలా
విశ్వప్రకృతినై వికసించాలని ఉంది



# కమలమయం

దేవీ !
ఎన్నాళ్ళుగా నీకు
అక్షరాభిషేకం చేస్తున్నాను
నిజానికి నిష్కామంగానే చేశాను
నా మనస్సెప్పుడు మలినమైందో
నాకే తెలియదు
అప్పటినుండి నీవు
పుష్పాభిషేకం చేస్తావనుకొన్నాను
కానీ,
నా నెత్తిన
ఎన్ని నిప్పుకణికలు క్రుమ్మరించావు
మనోయజ్ఞం చేసి
శుద్ధసాత్వికం వైపు పయనిస్తున్న తరుణంలో
భౌతిక వస్తు దృష్టితో
బొల్లిమచ్చను కుష్ఠుగా భావించి
అంతరంగ కమలాన్ని తొక్కావు గదా!
పాదపద్మం - అంతః కమలం
రెంటి మధ్య సాదృశ్యం
నీకు తెలియదా దేవీ!
పాదచక్రంనుండి సహస్రారం వరకు
అంతా కమలమయమే కదా!
మరి నాకిక పుష్పాభిషేకం ఎందుకు?
అయినా అక్షరాభిషేకం చేస్తూనే ఉంటా
నన్ను నేను ఆనందనిలయంగా మార్చుకొంటూనే ఉంటా!

# అమృతసూక్తం

అది 1967
ఆస్పత్రిలో వికటించిన సూదిమందు
మృత్యులోకాల్లోకి పయనం
ఎన్ని వర్ణాలో - ఎన్ని వర్ణ నక్షత్రాలో
ఎన్ని వర్ణకాంతి కిరణాలో
దూదిపింజంత - కొండంత
తేలితేలిపోతూ ఆకాశమార్గాన
విహరిస్తున్న కిరణపుంజం
విచిత్ర విభ్రమానంద మహావలయం
ఆ వలయంలో నేనో చిన్ని కణం
దారీ తెన్నూ తెలియక తేలిపోతున్నా
ప్రకాశిత సువర్ణధామంలో చక్కర్లు గొడుతున్నా
అది దివ్యం
అలాగే ఉంటుందనుకొన్నా
అలాగే ఉండాలనుకొన్నా
వర్ణతత్త్వం తెలిసిపోయిందని కేకలు వేస్తున్నా
కానీ ! ఎవరదీ?
దివ్యం నుండి భౌమ్యం వైపు మళ్ళీ లాగారు
మృత్తికా భస్త్రికలో బంధించారు
అది 1987
తడీ తడి తడి
నేనున్న ఇంటిచుట్టూ ఆవరించిన వేళ
విద్యుదాఘాతం - కరెంట్ షాక్ షాక్ షాక్



అమ్మా అమ్మా అమ్మా అంటూ వెనక్కుపడిపోయిన వేళ
మృత్యులోకాల్లోకి మరోసారి పయనం
చిక్కటి చీకటి చీకటి చీకటి
ఆ చీకటిలో
నేనో నల్లని దూదిపింజ
అంత చీకటిలో నేనెక్కడున్నానో
నా ఉనికి ఎంతో - అంతో
ఏమీ తెలియదు
అన్నీ మూగవోయాయి
గుంయ్యి అనే
ఒకానొక అఖండ దివ్యనాదం
బంధురాంధకార రణగొణ శాంతినాదం
నాదమయమైన
ఆచిక్కటి చీకట్లో
ఎల్లలు లేని కల్లగాని
ఆ చిక్కటి చీకటి చిత్‌లో చిత్‌లో చిత్‌లో
చిదానందమయమై పోతున్నా
దివ్యాంధకారంలో అస్తిత్వం కోల్పోతున్నా
అక్కడే చిరస్థాయిగా ఉండాలనుకొంటున్నా
కానీ ! ఎవరదీ !!
తన అమృత హస్తాలతో
కళ్ళనుండే అమృతాభిషేచనం చేస్తూ
అమృతసూక్తం పఠిస్తూ
సూత్రబంధంతో
తన ఒడిలో సేదదీర్చారు
నీవా హృదయాంతర్వర్తీ!
ప్రేమామృతమూర్తీ!! నమోనమః

# విరాగిలో రాగం

వసంతంలో ప్రకృతి చిగిర్చినప్పుడు
అది నీ పులకరింత అనిపిస్తుంది
వేసవిలో వేడి ఆవిరులు నాకు తాకినప్పుడు
అవి నీ ఊర్పుల్లా అనిపిస్తాయి
తొలకరిలో మేఘాలు ఉరిమినప్పుడు
అవి నీ గుండె చప్పుళ్లనిపిస్తాయి
ఆకాశం మేఘావృతమై కురుస్తున్నప్పుడు
అవి నీవు చల్లే పన్నీటి జల్లులనిపిస్తాయి
చలి గిలిగింతలతో ప్రకృతి వణికినప్పుడు
ఆ గుబుపులు నీ కాలి అందెల రవళులనిపిస్తాయి
భూమికి ఆచ్ఛాదనగా నిలిచిన చెట్టు ఆకులు రాల్చినప్పుడు
అవి నీ జడనుండి రాలిన మదన్‌మస్తులనిపిస్తాయి
నీ వెంట్రుకలు ఆవరించే చీకటి అని
నీ తలపైని మల్లెలు కాంతి నక్షత్రాలని
ఆధునిక భావకవి ఆర్ద్రంగా పలికాడు
నీవు పలికితే పగడాలని
ఒరిగితే ఒయ్యారాలని
నవ్వితే నవరత్నాలని
మా జానపదకవి మాబాగా అన్నాడు
వైరాగ్యం బీభత్సం నైరాశ్యం పైకొన్నప్పుడల్లా
ఈ భావాలు అమృతాన్ని పూస్తాయి
నన్ను చైతన్యవంతుణ్ణి చేస్తాయి



# చింతామణి

అప్పుడెప్పుడో
దీపం ఆరిపేయమన్నది నిజమే
కాని శాశ్వతంగా ఆరిపోతుందనుకోలేదు
ఈ మనస్సనే గుహలో చిక్కటి చీకటి
అందులో బుస కొట్టే నాగుపాము
తృష్ణా ధూమమై క్షణక్షణం కదలిపోతున్నది
ఇది అనర్థదాయకం
నాకే కాదు ఇది అందరికీ ముప్పే
అంటుజాడ్యంలా అల్లుకుపోతుంది
తేనె పూసిన కత్తయి కుచ్చుకొంటుంది
నా నీ ప్రాణాలు తీస్తుంది
ఈ చీకటిగుహ వెలుతురు గృహం కావాలి
అందుకే నన్నాదుకొమ్మంటున్నా
అనురాగం - ఆత్మీయత పంచుమంటున్నా
నా గృహం గేహళిమీది దీపమై
నన్ను ఋతంభరగా మార్చుమంటున్నా
శతాంకురగా తీర్చిదిద్దమంటున్నా
విశ్వంభరవై ఆశీర్వదించుమంటున్నా
ఆరణి చింతామణియై
గుండెగృహంలో నిలుపుమంటున్నా !

# పురుషోత్తమ పథం ?

నేను శిలను
శిల్పి తాకగా శిలలో నుండి
నీవు వస్తున్నావు
నన్ను తాకగా
జలమైపారాను
వృక్షమై నీడనిచ్చాను
మృగమై గాండ్రించాను
మనిషై మాయలో పడ్డాను
మూలం పాతాళమనుకొంటున్నాను
శిలనుండి మనిషి వరకు నన్ను తెచ్చిన ఓ ప్రభూ!
పురుషోత్తమ పథ సంచారానికి
నాకెందుకు మార్గం చూపడం లేదు.
ఈ కుమార్గం పంక భూయిష్ఠం
ఎన్నాళ్ళో ఈ సంచితం
ఎప్పుడు తీరుతుందో!
కర్మపరిపాక మెప్పుడో!
మాయాప్రకృతి నుండి విడివడి
సకుశల కర్మయోగంలో పడి
దివ్యమానవునిగా మారేదెప్పుడో!
నీ దయాదాక్షిణ్యాలు నామీద ప్రసరించేదెప్పుడో!
నేను నీవుగా మారేదెప్పుడో!
పురుషోత్తముణ్ణయ్యేదెప్పుడో!!



# అమ్మా !

నిన్నటివరకు పరమశాంతంగా ఉన్న
ఈ ప్రకృతి ఎందుకిలా లంఘిస్తున్నది
ఈ పావురం ఈకలెందుకూడిపడుతున్నాయి
ఈ సముద్రం ఎందుకింతగా ఘోషిస్తున్నది
ఆ చేప ఒడ్డునపడి ఎందుకలా గిలగిల కొట్టుకొంటున్నది
ఈ వెదురువీణ గొంతెందుకు జీరవోయింది
కోకిల కంఠంలో నక్క ఊళేమిటి?
సహన శీల భూమిలో ఈ కంపనమేమిటి?
దేవీ! శ్వేత నయనాల్లో ఈ ఎర్రజీరలేమిటి?
చేతిలో త్రిశూలమేమిటి?
నన్నెందుకు సుడిగుండాల్లో త్రోస్తున్నావ్
చేతి ఊతకర్రను కూడా లాగేస్తావేమిటి?
నీ మృగేంద్రాన్ని నాపైకి పంపుతావేమిటి!
అర్భకుణ్ణి నా అసువులు తీస్తావేమిటి?
నా చుట్టూ ఇన్ని విషాదాల చీకట్లేమిటి?
నీవు నా చేయిని వదిలావ్!
అందుకే ఇన్ని దిగ్భ్రాంతవలయాలు
శిశువుకూ పశువుకూ ఆసరా నీవేనమ్మా!
అమ్మవు నీవేనమ్మా!!

# స్పర్శ

మమాత్మా! ప్రియాత్మా!
నా గుండె బండయ్యింది
అది స్పందన కోల్పోయింది
నీవు స్పృశిస్తే తప్ప
అది లబ్‌డబ్ అననంటోంది

నా ఇంద్రియాలన్నీ
కార్యవ్యగ్రతలో
భావవేదనలు కోల్పోయాయి
నీవు మంత్రిస్తే తప్ప
ఈ యాంత్రిక స్థితి పరారు కానంటోంది

ఓ మూలకు మూల్గుతూ
జడస్థితిలోకి ఏదో
నన్ను లాక్కొని వెడుతోంది
మూల్గు నాదే అచేతన స్థితి నాదే
ఈ తలుపులు నీవు తెరిస్తే తప్ప
మాంద్యం నాపచేను పండనంటోంది

అమలిన దృక్పుష్పాలమీద
కోరికలు దుమ్ముకొట్టి
హృదయ కమలాన్ని
వికసించనీయడం కాదు
నీ ఉష్ణ తీక్ష్ణ కరస్పర్శతో తప్ప
పరిమళ నవజ్యోతిర్ధామం
నిన్ను ఆహ్వానించనంటోంది
తాదాత్మ్యం పొందనంటోంది



# గుడ్డిపూవు

ఈ జీవితంలో ఇక మిగిలిందేమిటి?
నీవిచ్చిన తనువున్నది
నాసికలో నీవూదిన ఊపిరున్నది
కళ్ళల్లో కాంతి ఉన్నది
నాలిక రుచిస్తున్నది
చెవులు వింటున్నాయి
చర్మం స్పృశిస్తున్నది
అంతా హీనంగా - బలహీనంగా - గుడ్డిగా
ఇంత సత్త్వమే ఉన్నది.
ఇవి జాజ్జ్వల్యమానమై ఎగిరిపడుతున్నప్పుడు
నీకు అర్పణ చేయలేదు
శరీరాన్ని మృదు స్పర్శకు,
గాలిని పరిమళాల ఆఘ్రాణానికి,
కళ్ళ కాంతిని సుందర దృశ్యానికి,
జిహ్వాగ్రాన్ని వింత వింత తిండ్లకూ,
శ్రవణేంద్రియాన్ని కదిలించే సంగీతానికి
విపరీతంగా వ్యయించాను.
ఇప్పుడు చేవలేని చేతకానితనమనే
ఈ గుడ్డిపూవును నీకిస్తున్నాను
గ్రహిస్తావో ! ఆగ్రహిస్తావో !! అనుగ్రహిస్తావో !!!

# వలయం

నీది దివ్య గృహాంగణం
నాది భూమ్యాంగణం
దివ్యత్వం అతి సూక్ష్మం - ఉనికి అనంతం
భూమ్యం అతిస్థూలం - ఉనికి విశాలం
అనంత తత్వంలోకి విశాల ప్రయాణం
తత్వం నిరోధించరాదు
కాని నాకు తెలుసు దేవీ! స్వచ్ఛ ప్రేమ స్వరూపిణీ !
స్థూల భౌమ్యంతో మలినమైన నన్ను
నీ గృహాంగణంలోకి అడుగుపెట్టనీవని!
స్త్రీది కాంతా హృదయమే కాదు
మాతృహృదయం కూడా!
అందుకే మాత్రారాధనలోనే సమస్తం ఉంది!
త్వమేవ మాతా త్వమేవ పితా ... తత్వం ఇదే!
చూడు!
నీ దివ్యాంచలంలో తలదాచుకొనే
చోటు దొరకదని నేనెంత ఆవేదన చెందుతున్నాను!
శ్రద్ధానందుల మాలిన్యం తుడిచిన 'శివ'వు నీవు కావా!
భ్రమరావాసిత సుగంధ మల్లికా పుష్పానివై
ఈ స్థూప సదృశ కంకాళాన్ని పరీమళింపజేయవా!
పునీతుణ్ణి జేయవా!
ఈ పునీత పరీమళంలో నే పరవశించి ఉండగా
నన్ను నీలో లయింపజేసుకోలేవా!
వలయింప చూచుకోలేవా!!



# నీడ - జాడ

దేవీ!
నేను నీ నుండి
పూర్ణ స్వాతంత్ర్యాన్ని ఆకాంక్షించడం లేదు
నాకు తెలుసు
నీ బంధం తెగిపోతే
నేను సైతాన్నయిపోతా!
నన్ను నన్నుగా ఈ లోకం
గుర్తించాలని లేదు
ఒకరి స్వాతంత్ర్యానికి
అడ్డు నిలవని విధంగా నన్ను తీర్చిదిద్దు
ఒకరి ఆలోచనలకు
ఆటంకం కలిగించని వానిగా నన్ను బ్రదుకనివ్వు
ఎదుటివారి భావాలను
ఒప్పుకొనే విధంగా నన్ను నడువనివ్వు
అందుకే నాకు స్వేచ్ఛనివ్వకు
కృతప్రకృతి విజృంభించనివ్వకు
నీ పేగుబంధం తెగిపోనివ్వకు
నీ నీడలోనే ఉండనివ్వు
నీ అడుగుజాడలోనే నడువనివ్వు

# ప్రణయ(వ)ం

ఓ మాత్మా ! ప్రియాత్మా!
ఈ తామసి
క్రూరరాక్షసి
నన్నెన్నాళ్ళు ఎన్నేళ్ళు
దిగజార్చింది
ప్రణయమూర్తివి నీవు
ప్రణవరూపవు నీవు
ప్రణవనాదాన్ని ఆపేసిన ప్రతిక్షణంలో
నేను
పాతాళంలోకి పడుతున్నా
ప్రణవానిది ఆచార్యస్థానం
ప్రణయానిది అద్వైతస్థానం
ఊర్ధ్వమూలం వదలి
అధశ్శాఖలు పట్టుకొని వ్రేలాడితే
మిగిలింది తమోజగత్తు
పైకొన్న రాక్షసరతిలో
అతీగతీ తెలియని స్థితి
అందుకే ఓ ప్రణవమా!
నా ప్రణయమా!
నన్ను ఊర్ధ్వమూలంగా సాగనివ్వు
సర్వోన్నత పరమగమ్యం చేరనివ్వు



# కల్మషాయత్త కమలిని

ఓ దివ్య తేజోమయ మూర్తీ!
ఈలోకంలోకి నన్నెందుకు పంపించావ్
నాతో ఏ పని చేయించాలని!
నన్ను పంపించకపోతే ఏమయ్యేది!
ఈ కల్మషాయత్త మధుజగత్తులో
ఇన్నాళ్ళు ఎంతో నిర్మలంగా ఉన్నాను
పొద్దు వ్రాలిపోతున్న ఈ తరుణంలో
నేనెందుకిలా కుళ్ళిపోయాను
అన్నీ తెలిసి అడవిలో పడ్డాను
అన్నీ తెలిసినాయా అని అనుమానం
అన్నీ తెలిస్తే హృదయ పద్మం నుండి
రాముడెందుకు తొలగుతాడు
ఆస్థానంలో తృష్ణ ఎందుకు తపిస్తున్నది
తులసీదాసులో పరిణామం
వేమన్నలో మార్పు
శ్రద్ధానందలో పవిత్ర చైతన్యం
ఏదీ దాసధర్మపత్ని
ఎక్కడా వేమన్న వదిన
కనిపించదే ఆనందమాయీ శివ
నా కర్మబంధాలసలే తెగలేదు
మరీ మరీ ముళ్ళుపడ్డాయి
బంధాలు తెంపెయ్ స్వామీ!
సౌందర్య శివానందంలో ముంచెయ్ స్వామీ!!

# ఫలంలో పరమాత్మ

హాలం గొడ్డలి కలం
ఇవీ జీవనయానంలో చేతి పరికరాలు
వంటచేసే తల్లి పవిత్ర భావనతో ఉంటే
పక్వాన్నం అమృత ప్రసాదమవుతుంది
తినే వ్యక్తి సదాశయ భావనలతో తింటే
ఆ భావాలే మనస్సులో నాటుకొంటాయి
మరి నేను నాగలితో భూమిని దున్నేప్పుడు
సమభావనతో దున్నానా?
ముళ్ళకంపను గొడ్డలితో కూల్చేప్పుడు
దుష్టశిక్షణపై దృష్టి నిలిపానా!
కలం ప్రవాహంలా స్రవించేప్పుడు
సర్వాత్మ ఏకతా తత్వాన్ని నింపుకొన్నానా!
ఇవి ఉంటే ఆశ్రమోత్పత్తిలో
ప్రభూ! నీవుంటావు
అవి లేనప్పుడు ఆ ఫలంలో
జడలు విరబోసుకొన్న వటవృక్షముంటుంది
అందుకే నీ ధ్యానంలో నీ జపంలో
నీ నామస్మరణంతోనే
నన్ను కర్మయోగంలో కదలించు
నిష్కామకర్మయోగంలో నడిపించు



# నిత్య సత్యం

నీవొక తత్వానివో - చైతన్యానివో
కనిపించని జడానివో
నాకింతవరకు అర్థం కాలేదు
ఏరూపంలో లేవు
అన్నిరూపాలు నీవే
ఏకకణంగా ఉన్న నీవు
ఇంతగా విస్తరించి ఆనందించావు కదా!
నీవు విస్తరిస్తే ఎవరికీ బాధలేదు
కాని నేను విస్తరిస్తే
మరొకరికి బాధ తప్పదు
వారు కూడగట్టుకొని
నా అస్తిత్వానికే ముప్పు తెస్తారు
నీ అస్తిత్వం శాశ్వతం
నా అస్తిత్వం విచలితం
జన్మలెన్నో ఉన్న నేను మాయ
నీవే నిత్యం - సత్యం
నేనూ నిత్యసత్యం కావాలి
నీ దివ్యత్వంలో లీనమైపోవాలి

# కొలమానం

నీళ్ళ జాడలు తెలుసు
నింగిదారులు తెలుసు
పూలబాటలు తెలుసు
కాంతికిరణాలు తెలుసు
కానీ, నన్నావరించుకొన్న విశ్వాత్మా!
నీ మనస్తత్వం తెలియదేమిటి !
భౌతికత మీద ఎప్పుడూ విజయం సాధిస్తా
భావనా తరంగాల లోతుల్లో ప్రవహిస్తా
పరిమళాల నేరుకొంటా
పైరగాలి పంచుకొంటా
కానీ మహాత్మా! దివ్యాత్మా!
నీ వర్ణం కావేమిటి?
మేఘాల మేలి ముసుగు కప్పుకొంటా
మంచుపల్లకి శయ్యగా మార్చుకొంటా
పల్లేరును జిల్లేడును పత్తిపువ్వులా చేసుకొంటా
పామర ప్రకృతిని ప్రతిభాసమానంగా దిద్దుకొంటా
కాని ప్రియాత్మా! రసాత్మా!
నీ అంతరంగం అవగతం కాదేమిటి?
నైరూప్య హేలా! నిర్గుణ చిత్కళా!
మనోజ్ఞ బాలా! సౌందర్యశీలా!
నేనెంత పిచ్చివాణ్ణి! అమాయకుణ్ణి!
అణువుతో బ్రహ్మాండాన్ని కొలుస్తున్న చిన్నవాణ్ణి



# శూన్యంలో చైతన్యం

నిన్నటివరకు
నా పక్కనే ఉన్న నీవు
లేవన్న క్షణంలో
శాంతి కరగిపోయింది
జీవనవనంలోని పుష్పం రాలిపోయింది
అయినా మళ్ళీ నీవు వస్తావని
దర్వాజాలో నిలబడి
ఆకాశంకేసి చూస్తుంటా
శూన్యంలోంచి చైతన్యం
పుట్టుకొస్తుందిలే అని ఆకాంక్షిస్తుంటా
మబ్బు కురుస్తుంది
మ్రోడు చిగిరిస్తుంది
బీజం మొలకెత్తుతుంది
అంబుధి ఆవిరి అవుతుంది
ఆవిరి వర్షమవుతుంది
చైతన్యం నీవై నన్నావరిస్తావు
అప్పుడు శూన్యంలోంచి నేనే ప్రభవిస్తా
ఏ రూపంలో ఉన్నా
నీవే నేనని నిరూపిస్తా

# అనుబంధం

దివ్యాత్మా!
విశ్వవిభూతివి నీవు
గడ్డిపరకను నేను
నీ విభూతిలో కలవాలని
తపిస్తున్నా జపిస్తున్నా
కానీ,
నే తలెత్తనీకుండా
తొక్కేవారు - ధూళి చిమ్మేవారు
అలా పైకిలేస్తే
తెగనరికేవారు
నా అస్తిత్వానికే ఎసరు పెట్టేవారు
తామసాక్రోశంతో పగబట్టినవారు
అడుగడుగునా విప్లవిస్తున్నారు
వికటాట్టహాసం చేస్తున్నారు
కానీ,
అలనాటి గరుడుని అమృతభాండం స్పర్శతో
ఈ గడ్డిపరక
అమరమైందని
గణేశుని పూజాదూర్వహమైందని
నీకు తెలుసు!
కాని ఈ సైతాన్లకేం తెలుసు
నీ నా బంధం
సృష్ట్యాది నుండి ఉన్న అనుబంధం



# పూజారిని

నేను కటిక చీకటిలో ఉన్నా!
గాఢ నిద్రలో ఉన్నా!
ఏదీ నా స్వర్గధామం
ఎవరెగరేసుకుపోయారు
కళ్ళు తెరిచాను
దురాక్రమణ దారుల కాళ్ళకడ ఉన్నా
కామం క్రోధం మోహం
లోభం మదం మత్సరం
నా చిక్కటి చీకటి నిద్రను గుర్తించాయి
నా స్వర్గధామాన్ని ఆక్రమించాయి
నా అభిరామాన్నీ - ఆరామాన్నీ సంక్షుభితం చేశాయి
కళ్ళు తెరిచేవరకు
ఆర్గురు శత్రువుల పాదాల క్రింద సంక్షుభితుణ్ణి
ఓ వెయ్యేళ్ళ హంసా!
వే వెలుగుల పరమహంసా!
నీ కరదీపిక నంపవా!
కరుణ కిరణాల నొంపవా!
అరిషడ్వర్గాలింగనంలో నుండి తప్పింపవా!
అలసటలో అయోమయంలో
నిద్రలోకి జారిన నీ పూజారిని కదా!
పొరపటు అలవాటుగా మార్చుకొనని
నివేదనా సూక్తం పఠిస్తున్న
నిత్య సత్య పూజారిని కదా!!

# దీపం

పొద్దు వాలిపోతోంది
పొరుతోనే ఇన్నాళ్ళు బ్రదికాను
ఇంకా పోరాటమా!
గమ్యాన్ని చేరేవరకా!
భౌతిక వాంఛా పరితృప్తి నిమిత్తం
చేసిన ఈ పోరాటం చాలు!
నీ ప్రేమమయ - ప్రశాంతమయ అంకసీమలో
అలా ఒరిగిపోయి
ఆకాశంవైపు చూస్తూ -
చుక్కల కాంతికి మూలమేదీ!
సూర్యుని వేడికి కేంద్రకమేదీ!
గాలి పుట్టుక ఎక్కడ!
నీటికి ఆధారమేది!
వసుంధరా రాగానికి పీఠమేదీ?
తత్ - చిత్ - సత్ ల బిందువేదీ!
శుక్రధాతువుల యోగంలో 'చితి' కిరణమేదీ?
ముక్తి ధామమేదీ?
.... ఇలా ఇలా ఇవే ఇవే అడగాలని ఉంది
సర్వాంతర్యామా!
నీకు తెలియనిదేమిటి?
అందుకే ఆకాశవాణివై పలికావుగా!
"అంధ తమస్సులోని హృదయ కమలమా
అక్కడ దీపం వెలిగించుకో" - అని



# నేనంటే ప్రాణం

ప్రాణం నీది
దేహం నాది
ప్రాణమున్నది
దేహం ఎదుగుతున్నది
మరి ఈ దేహం మీద ఈ బంధాలెందుకు?
పూలెందుకు!
పూతలెందుకు?
బిగుతు వస్త్రాలెందుకు?
ప్రాణం వల్ల అందమా!
బంధం వల్ల అందమా!
వస్త్ర సంస్కృతి ముసుగులో
ఎన్ని పాపాలు చేస్తున్నాను
ఎన్ని వ్యామోహాలు పెంచుకొంటున్నాను
స్వేచ్ఛలేక గిలగిల కొట్టుకొంటున్నాను
ఉన్న భావాల మీద
లేని భావాలు కప్పుకొని తిరిగే వంచకుణ్ణి
నీవిచ్చిన ప్రాణమంత స్వచ్ఛంగా
నన్ను బ్రతకనీ!
నాలో ఈలోకం నిన్ను చూచేట్లుగా
నన్ను సంస్కరించుకోనీ!
నేనంటే ప్రాణమే గానీ
పై మెఱుగులు కావని లోకం అనుకోనీ!

# పట్టవలసిన పట్టు

ఇన్నాళ్ళు నా చేయి పట్టుకొని
ఇప్పుడు నన్ను వదిలేశావేమిటి?
నాది జారిపోయే స్వభావం
స్థిరత్వం లేని మారుతాన్ని



పుట్టుకలోనే మత్స్యం పిల్లను వదలుతుంది
పెరగడంతోనే ఆవు లేగను వీడుతుంది
పుష్పం ప్రతి ఉషోదయాన భ్రమరాన్ని కక్కేస్తుంది
తల్లి చంటిని వదలదు
  చంకపోరణ్ణీ వదలదు
  వ్రేలు పట్టేవాణ్ణి వీడదు
  తన భుజాల వరకు వచ్చినా వదలిపెట్టదు
  తనతో సమానురాలు లభించినప్పుడే వదలిపెడుతుంది
కాని. నీకింత నిర్దయ ఎందుకు
సరిగా మధ్యందినంలో నన్ను వదిలావెందుకు?
నడకలు నేర్చినా
నా నీ సంవేదనలు పలికినా
మిగిలినవేమున్నవి
బాధాతప్త హృదయాలు - కొన్ని తీపిగుర్తులు తప్ప!
ఇవే నా కళ్ళ జ్యోతులు
తప్తం అరుణం - తీపి శ్వేతం
మసక బారుతున్న నన్ను
ఇవే ఉత్తేజితుణ్ణి చేస్తున్నాయి
ఎక్కడున్నావో దేవీ
ఆ పర్ణాల్లో కలిసిరా!
అలాగే చేయిపట్టుకో!
నీ సేవనుండి జారేవిధంగా మళ్ళీ చేయి వదలకు! ●

# చైతన్య ఫలం

నీ దయా వీక్షణాలు కురువనీ
నన్ను అడుగడుగునా తాకనీ
ఇది ఎండకు వాడిన మొలక
వానకు తడిసిన చిలక
గాలికి కందిన పువ్వు
బాధకు క్రుంగిన నవ్వు
కాంతి కోల్పోయిన నగ
చిఱిగిన నిన్నటి వస్త్రం
కఱిగిన వర్తమాన స్వప్నం
లేవలేని నడపీనుగు
చావలేక ఎత్తువడ్డ ఏనుగు
ఓ అంధకార బంధూ!
నీవే నా ఆపద్బంధూ!
ఆదుకోడానికి వచ్చిన దయాసింధూ!
ఎన్నాళ్ళకు వచ్చావు
కరుణను పన్నీరుగా చల్లుతున్నావు
ఇలాగే ఇలాగే నాపై
నీ దయావీక్షణాలు కురువనీ
నన్ను అడుగడుగునా తాకనీ
ఈ క్రుంగినవన్నీ -కమలినవన్నీ
చెదరినవన్నీ కుదురుకోనీ
నీ సేవలో నే మరణ పర్యంతం నిలచిపోనీ!
నీవుగా నీవుగా నీవుగా మారిపోనీ !!



# నీవాణ్ణి

ఓ జగన్నియంతా! అనంతా!
నీ మాయ దాట కష్టం అని
నీవే అంటే నా గతేంకాను!
మాయలో పడ్డ నేను
మనిషిని మనీషిని కావలనుకొంటున్నా
తారకమే తరించడం కష్టమంటే
నేనెవరి పాదాలు పట్టుకొనేది?
నేనే ఔషధం పుచ్చుకొనేది!
ఆనాడు జగన్మోహినివై మాయ చేశావ్
అసురుల కొంప ముంచావ్
ఆదిత్యుల నాదుకొన్నావ్
నేనూ ఆదిత్యుణ్ణే
అసురుణ్ణీ కాదు - అసుర పక్షమూ లేదు
అంతా ఉన్న నీవు
అంతటా ఉన్న మాయను గళాన నిలుపలేవా!
అమృతాన్ని పంచలేవా?
ఈ జీవుణ్ణి నీ చైతన్యంతో
నా ఉపాధిలో ఉన్నవాణ్ణి
నీ గురించే జపిస్తున్నవాణ్ణి
మాయ దాటాలని మథనపడుతున్న వాణ్ణి
మహామానవుణ్ణి
నిన్ను తప్ప ఎవరినీ ఏదీ కోరని వాణ్ణి
నిత్యం సత్యం నీవాణ్ణి!!